గోవిందపుర గ్రామమంతయు నల్లకల్లోలముగ నున్నది. ఎవరిముఖమును చూచినను విషాదచ్ఛాయలే. జమీందారు గారి గుమాస్తా భూమిపన్ను వసూలుచేయుటకై వచ్చియుండుటయే యందులకు హేతువు. ఈ మారు యువరాజు మనోహరుడుకూడ వెంట వచ్చియుండెను. గ్రామములోనున్న యొకగృహము ప్రత్యేకముగా పరిశుభ్రముచేయబడి యువరాజునకును పరివారమునకు నొసంగబడెను.

నాటిసాయంకాలము మనోహరుడు రాజకార్యముల నుండి విముక్తుడై విహారార్థమై బయలుదేరి గ్రామముదాటి తూర్పువైపుగా నడచి పోవుచుండెను. పంట కాలువ గట్టు మీదుగా నడచుచు నిరుప్రక్కలగల పంటచేలలో వేయబడిన పునాసపైరుల సొబగును చూచుచు గ్రామపుపొలిమేర దాటి పోయి యొకమెత్తని యిసుకతోనున్న ప్రదేశమున గూర్చుండి ప్రకృతిశోభను దిలకించుచుండెను.

ఆకస్మికముగ దూర్పుదిశ మేఘాచ్ఛన్నమై క్షణ మాత్రములో నాకసమంతయు నావరించి గర్జింపసాగెను. మనోహరుడు వర్షహేతువును శంకించి విడిదికి బయలుదేరుటయే తడవుగ సన్నతుప్పర ప్రారంభమై విజృంభించెను. మనోహరు డెంతసత్వరముగ గమనమును సాగించుచున్నను వర్షపాతమును దప్పించుకొనలేకపోయెను.

తీవ్రవర్షమునకు బట్టలు సగమునకుపైగా తడిసియుండుటచే గ్రామములో బ్రవేశించుటయేతడవుగ నొక పూరింటిలో తాత్కాలికముగ బ్రవేశింపఁబోవ నిద్దరు స్త్రీలు వాకిటిలోనొకరికొకరెదురై సంభాషించుకొనుచుండిరి. వారిలో నొకతె మధ్యవయస్సు దాటియుండెను. రెండవయామె నవయౌవనవతి సింహద్వారములో నిలువఁబడి వీధివైపుఁ జూచుచు మాట్లాడుచున్న యాసుందరి మనోహరుని వీక్షించెను. ఇద్దరివీక్షణము లన్యోన్యమిశ్రితములయ్యెనని వేరుగ చెప్పనక్కరలేదు పరపురుషసందర్శనమున సిగ్గుపడి యాచక్కెర బొమ్మ లోనికేగెను.

మనోహరుడు నిలువబడి యా ప్రౌఢయువతితో సవినయముగ,

"క్షమింపవలయును. అడుగకుండ బ్రవేశించినందులకు సంశయింపవలదు. వర్షము వెలిసినతరువాత వెడలిపోయెదను."

లోపలికిపోయిన సుందరి కీమెతల్లి. వయస్సున కరువదవ సంవత్సరము సమీపించుచుండెను.

మనోహరు నామె పూర్వమే వీక్షించియుండుటచే గుర్తించి భక్తిశ్రద్ధలతో లోనికాహ్వానించి .

"నాయనా! రమ్ము. వర్షము వెలిసినపిదప పోవచ్చును"

అని పల్కుచు, నొకచాపను లోపలపరచెను. మనోహరుడు దానిపైకూర్చుండి నలుప్రక్కల వీక్షించుచుండెను.

అతనికన్నులు దేనినో వెతకుచున్నవి, అంకురించి వికాసత నందుచున్న తారుణ్యదశచే ప్రకాశించుచున్న యా చక్కదనాలకుప్పయొక్క మనోహరాకృతి ప్రథమవీక్షణముననే మనోహరునకు మనోహర కారణమయ్యెను. ఆమెపేరు కమల. పేరునకు తగినరూపము ; రూపమునకు తగిన గుణములు నామె యందు స్థిరపడెను.

కమలయు మనోహరుని స్వరూపముచే నాకర్షితయై లోపలికేగి తలుపుచాటుననుండి తొంగి తొంగి చూచుచుండెను. తల్లి లోపలికేగి యువరాజునకు పాదముల కడిగికొనుటకై నీరము తేబోయెను. తత్సమయమున కమల యీావలకువచ్చుట సంభవించెను. తత్కారణమున కమలామనోహరులు పరస్పరవీక్షణ ప్రసారముచే సౌందర్యసుధాపానముం 'జేయ నారంభించిరి. ఇంతలో తల్లి జలపాత్రనుదెచ్చి ముందుంచుటచే వారిచూపులు వెనుకకు మరలిపోయెను. తమ నేత్రావధానమునకును వీక్షణరూపమున ప్రకటితమొనర్చుకొనుచున్న భావములకు నాటంకమువచ్చుటచే జేయునదిలేక యువరాజు పాదప్రక్షాళనమాచరించుకొని చాపపై గూర్చుండి ప్రొద్దుగడచుటకై కమల తల్లితో నిట్లు ప్రసంగముల నారంభించెను.

మనో : మీాకు కుమారులుండిరా ?

తల్లి : లేరు. ఒక్కకుమార్తెగలదు. ఆ బిడ్డయే నాసర్వస్వమై యున్నది.

మనో : జీవనాధారమునకు మార్గమేమి ?

తల్లి : ఇదివరకెట్లో ఇకముందు నంతియే.

మనో : ఆ మార్గమేమో తెలిసికొన గోరుచున్నాను.

తల్లి : కమలతండ్రి చనిపోయినప్పటినుండియు భగవానుడే రక్షకుడు. ఒక యకరము భూమి కలదు. దానిపై నలుబదిరూపాయలు రాబడి వచ్చును. అంతకన్న వేరాధారము లేదు. శరీరకష్టముకూడ కొంచెము సహాకారమగుచుండును. కలిగిననాడు తినుట లేనినాడు పరుండుట ఇదే మాదినచర్య.

మనో : మీకుమార్తెకు వివాహమైనదా ? వయస్సెంత?

తల్లి : పదునైదవసంవత్సరము ప్రవేశించినది. ఇంకను వివాహము కాలేదు.

మనో : తగినవరుని విచారింపుడు. పెద్దలగుమీజీవితము కూడ కూతురు, అల్లుని చేతులలోనే దాటవలయునుగదా ? అందుల కనుకూలముగ వరాన్వేషణము జేయుట మంచిది.

తల్లి : నాయనా ! నామాటకేమి ! గుణవతియగు నా బిడ్డకు తగినభర్త లభించిన చాలును. నాకు భగవానుడే యాధారము. ఇంతకును ధనహీనులమగు మాకు తగిన సంబంధ మెట్లుదొరకును ? నిరుపేదల జీవితములు నిరర్థకములు.

మనో : ఇట్టి చక్కనికన్య నిచ్చినదేకాక . వేరుధన మీాయవలయునా ?

తల్లి : ఈ కాలములో నరులకు వధువుయొక్క సురూప సుగుణము లక్కరలేదు. డబ్బే కావలయును.

దానికే పుస్తె ముడివేయుచున్నాడు.

మనో : ఏమైనను పెండ్లిచేయక తప్పదుగదా ? అందులకై ప్రయత్నించుట మంచిది.

తల్లి : నాకట్టి యాధారమేమున్నది ? ఎవరు ప్రయత్నింతురు ?

వర్షము వెలిసెను. ఆకాశము స్వచ్ఛముగ నున్నది. క్రమక్రమముగ చీకటి లోకమునంతయు నాక్రమించుచుండెను. మనోహరుడు లేచి వృద్ధురాలితో నిట్లనెను.

వర్షము వెలిసినది. నేను వెళ్ళి మరియొకమారు వచ్చెదను. మీా కుమార్తెకు తగినసంబంధమును వెదకి తీసికొనివచ్చి పెండ్లిచేయుభారమునాది. మీాకు దిగులక్కరలేదు.

తల్లి : కృతార్థురాలను. దీనబాంధవులగు మీా రిచ్చిన యభయప్రధానమే మాకు ప్రధానాధారము.

మనోహరుడు చిరునవ్వుతో వెడలిపోయెను. ఇంతవర కతని ప్రసంగము నత్యాసక్తితో వినుచున్నకమల తల్లిని సమీాపించి అమ్మా ! వారెవ్వరు ? అని ప్రశ్నించెను.

తల్లి : నీవు గుర్తించలేదా ! మన జమీాందారుగారి కుమారుడు మనోహరబాబు. దయగలవాడు. దీనులనుకా

పాడే స్వభావముగల సజ్జనుడు. నీవు లోపలికేగి దీపము వెలిగించి వంటప్రయత్నము జేయుము. వర్షము వెలిసినది.

కమ : బియ్యము నిన్నటికే తక్కువ. ఈనాడు దేనిని వండవలయును ?

తల్లి : అట్లయిన నీ దినమంతయును నుపవాసమేనా ?

కమ : అంతకన్న నేమిచేయవలయును ?

తల్లికన్నులనుండి దుఃఖబాష్పములు బయలుదేరెను. దరిద్రదశను దలంచుకొని బిడ్డనక్కునజేర్చుకొని కడుపెడాకలితో నిద్రించెను. కమలకుమాత్రము నిద్రరాలేదు. అందుల కాకలియే కారణమా ?

౨

మనోహరుడు భుజించి తనశయ్యపై పరుండెనేగాని మాటిమాటికి కమలయొక్క వదనబింబమే మనస్సులో గానవచ్చుచుండెను. మాటిమాటికతని నోటినుండి ఎంత చక్కనిముఖము ? ఎంతవిశాలములైన నేత్రములు ? విధియొక్క సౌందర్యనిర్మాణమునకు సరిహద్దువలెనున్నదే. అంత చక్కని సుందరాంగి నెచ్చటను చూడలేదనువాక్యము లప్రయత్నముగ వెలువడెను.

ఆ యనాఘ్రాత కుసుమమును బరిణయమాడిన వాని యదృష్ట మేమనవచ్చును. ఆ భాగ్యం నా కెట్లుకలుగును ? నేనంగీకరించిన నాతండ్రి యంగీకరించునా ? పేదయింటి పిల్లలు భాగ్యవంతుల దృష్టిలోనుండుట యసంభవము.

ఇట్టి తలంపులతో నతడా రాత్రియంతయు వేగించెను. ప్రాతఃకాలమునకుముందే లేచి వాయుసేవనమునకై బయలు దేరి సూర్యోదయమునకు తిరిగివచ్చి కాలకృత్యముల దీర్చు -కొని కార్యస్థానమున కరుదెంచి యొక బంట్రోతును పిలిచెను. భటుడువచ్చి నమస్కరించి నిలువబడ నతనిచేతికి గొంత రొక్కమిచ్చి యా ధనమునకు సరిపడిన బియ్యమును మంచిరక మును పట్టించుకొనిరమ్మనిపంపి వెంట నొకపరిచారకుడు రాగా నదీస్నానమునకు బయలుదేరెను.

నదీస్నానమునకు కమల యింటిముందుగనే పోవల యును. మనోహరు డామె నింకొకమారు చూడవలయునను తలంపుతో సేవకులు సిద్ధమొనర్చిన జలమునువదలి నదీస్నాన మునకని ప్రయాణమయ్యెను. కమల యిల్లొక పూరిగుడిసె యగుటచే నామె యుపయుత్నముగనే కాన్పింపగలదని యతని యభిప్రాయము.

మనోహరు డావిధముగ కల్పనాతరంగముల నూగు లాడుచు సేవకునితో నామె యింటిముందునకువచ్చి త్రోవను

బోవుచు నొక్కమారా యింటిని వలయఁజూచెను. ఏమిలాభం? ఆశాభంగమైనది. కమల యింటిలోలేదు. తిరిగివచ్చునప్పుడైన కానరాకుండునాయను నాసతో నతఁడు నదీతీరమున కేగెను. ఈ మారతని సంకల్పము నెఱవేఱెను. తోడిబాలికలతో గలసి నదిలో స్నానము జేయుచున్న కమలనుజూచి యుప్పొంగిన మనస్సుతో నొకవైపున నిలువబడి యా బాలికామణి సౌంద ర్యమును నిదానించి చూచుచు నిలుచుండెను. ఎంతచూచిన నతనికి తనివితీరలేదు. ఆమె నెట్లయిన వివాహమాడవలయు నను తలంపు దృఢముగ నాటుకొనెను. కమలయు నతనిని మాటిమాటికి జూచుచు తన మనోభావములను ప్రక్కనున్న బాలికలు గమనింతురేమో యను భయమున నచటనుండి తిరిగి తిరిగి చూచుచు నింటికేగెను. మనోహరు డామె రూప మునే స్మరింపుచు స్నానమును పూర్తిచేసి వేరువస్త్రములను ధరించి బసకు బయలుదేరెను. సేవకుడు యువరాజు స్నానము చేసి వదలిన వస్త్రముల నుతికి భుజమున నిడుకొని ప్రభువు వెంట వెళ్ళెను. కొలదిగడియలకే వారిర్వురు విడిది జేరిరి.

మనోహరబాబున కీసమయమున వేరువాంఛలేమియును లేవు కమలారూపసుధాపానమునకన్న నతని కెట్టితలంపు లును లేవు. అతని హృదయమందిరమున కమలావిగ్రహము స్థిరముగ స్థాపనమయ్యెను. ఏ విధముగనైన నామెను పెండ్లాడ స్థిరప్రతిజ్ఞను బూనెను. ప్రేమమార్గమున నూతనముగ ప్రవే శించిన యాతని యా వేశ మంతకంతకు వృద్ధియగుచుండెను.

నదినుండి జలఘటమును చంకనిడుకొని పోవునప్పు డామె దీర్ఘ వేణీబంధము విడివడి పిఱుదల కంటుచుండెను. ఆ సమయ మందు జూచిన దృశ్యము నతడు సర్వదా ధ్యానము చేయు చుండెను.

కమలయు నామె తల్లియు గతరాత్రి బియ్యము లేక పోవుటచే నుపసించిరి. తెల్లవారినది. ఇంట బియ్యములేవు. దిన మెట్లు గడువవలయును ? ఎంతకాల మీ రీతి జరుపవలయునో యెవ్వరెరుంగుదురు? ఇంటనున్న రెండుదోసకాయలను కూరగా వండి మూతవైచి నదికేగి స్నానముచేసి జలమును గొని వచ్చెను. ఈ లోపుగా తల్లి యొకపూటకైన బియ్యము సంగ్ర హించుకొని రావలయునని బయలుదేరి పరిచయముగల యిండ్ల కేగి ప్రయోజనములేమి నిరాశతో దిరిగివచ్చెను. తల్లియొక్క ముఖవైఖరినిజూచి కమల గ్రహించి తడిబట్ట నారవైచుచు అమ్మా ! బియ్య మెచ్చటను దొరకలేదా ? అని యడిగెను. తల్లి కన్నీరుగార్చుచు కుమార్తెను దగ్గరగా దీసికొని బిడ్డా ! ఇవి మనకు దుర్దినములు అని వగచెను.

కమ : ఇప్పు డేమిగతి ?

తల్లి : నా కేమియును దిగులులేదు. ఈ కష్టకాల ములో నా కాధారముగనున్న నినుగూర్చియే విచారపడు చుంటిని. బిడ్డా ! యుక్తవయస్సునకు వచ్చుచున్న నీకు భోజ నము పెట్టలేని నిర్భాగ్యురాలను. కన్నబిడ్డ కొక పూటయైన

నన్నము పెట్టలేనితల్లి యుండేమి ? లేకనేమి ? ఏదోవిధముగ నీ పెండ్లి జేసి నిన్న త్తవారింటికనిపిన నాకీ దిగులుండదు.

కమల మాటాడక తలనువంచుకొని తల్లిప్రక్కను గూర్చుండెను. తల్లిబిడ్డల క్రీప్రసంగము జరుగునప్పుడే మనోహరుడు స్నానముచేసి విడిదికివచ్చుచు కమల యింటిముందు గమనమును తగ్గించి యోరగంట నామెంజూచుచు తల్లిమాటలను సావధానము నాలకించెను. అతని హృదయమునకు వారిర్వురి కష్టములు తెలియవచ్చెను.

మనోహరబాబు బియ్యమునకై పంపిన భటుని రాకకెదురు చూచుచుండెను. కార్యస్థానములో యువరాజుతో వచ్చిన పన్నులు వసూలుచేయు గుమాస్తా వేరొకపనిమీద గతదినమందే గ్రామాంతరమరిగి యుండుటచే మనోహరబాబొకడే కూర్చుండియుండెను. అంతలో బజారుకుపంపిన భటుడుబియ్యమును పట్టించుకొనివచ్చి కట్టెదనుంచి నిలువబడెను.

భటు : సర్కార్ బియ్యం నెచ్చటకు గొనిపోవలయును?

మనో : దీని నిర్వురు సేవకులచే పట్టించుకొని పోయి యూరుచివర నదికిబోవు దారిలోనున్న యొక నిరుపేదవృద్ధురాలి యింటిలోనుంచి రావలయును.

భటు : సర్కార్ ! ఆమె పేరేమి ?

మనో : పేరు నాకు తెలియదు. ఆయిల్లు నదికిబోవు దారిలో నున్నది. దానిలో తల్లి కూతుండ్రిరువురే కలరు.

మరికొన్ని పేద వితంతువుల కటీరములు కలవు. ఈ బియ్యా మా తల్లి కూతుండ్ర కిచ్చి రావలయును.

భటున కర్థముకాలేదు. ఎవ్వరాయని యాలోచించు చుండెను. యువరాజుతో నదికేగిన సేవకు డసాధ్యుడు వయో వృద్ధుడు. చాల ప్రాచీనుడు. కాని కొంచెము దుష్టస్వభావము కలవాడు. నదీతీరమున కమలా మనోహరులకు జరిగిన పరస్పర వీక్షణముల నతడుచూచి సంశయించెను. తిరిగి వచ్చి నప్పుడు కమల యింటిముం దతడు చూపిన యభినయమును బాగుగ గమనించియున్నవాడుగాన నీ బియ్యా మామెయింటికే యనియు నా సుందరాంగి నితడు ప్రేమించెననియు సులువుగ గ్రహించి యిట్లనెను.

సర్కార్ ! కమలయొక్క తల్లియా ?

మనో: ఆమె కమల తల్లియో విమలతల్లియో నాకు తెలియదు. గతరాత్రి వర్షములో రాలేక నొక యరగంట కాల మా యింట నిలువబడి చూడగా వారిర్వురును తిండికి లేక మాడుచున్నట్లు వారిమాటలవలన గ్రహించితిని. కనుక నీ బియ్యా మా యింటిలో బడవేసి రావలయును.

వృద్ధసేవకుడు మనస్సులో నవ్వుకొనెను. తన హృదయ గతాభిప్రాయమును కప్పిపుచ్చుటకు యువరాజీ డొంకతిరుగు డు మార్గము పట్టెనని తలంచెను. కాని యదార్థముగ మనో హరునకు వా రిర్వురిపేరులు తెలియవు.

వృద్ధసేవ : సర్కార్ ! పాపమా తల్లిబిడ్డలు చాల కష్టములలో నున్నారు. తామిప్పు డాహారముపంపకున్న వారు తిండిలేక మరణింపవలసినదే.

మనో : నీవా యింటి నెఱుంగుదువా ?

వృ : చోటాసర్కార్ ! తెలియకేమి ? ఉదయము మనమా యింటిముందుగనే నదికిపోయియుంటిమి. పాపమా పిల్ల చాలచక్కనిది. ఇంకను వివాహము కాలేదు.

మనో : అనవసరవిషయములను కట్టిపెట్టి యీబియ్యము నా వృద్ధురా లింటికి జేర్పించుము.

వృద్ధసేవకుడు మాటాడక ఇద్దరు మనుష్యులచే నాబియ్యపు మూటలను మోయించుకొని వెడలిపోయెను. పై ఖర్చుకు కొంతద్రవ్య మీయదలంచెను. కాని సేవకుడు కమల చక్కదనము పెండ్లికాకపోవుట మొదలగు విషయము లను దలపెట్టుటచే మనోహరు డనుమానించి వీని యెదుర ధనముగూడ నొసంగిన మరియు సంశయాస్పదమగునని యెంచి యూరకుండెను.

3

తల్లి కుమార్తె లిద్దరు ద్వారబంధమునకు దగ్గరగా కూర్చుండి నిరాశాబద్ధములగు హృదయములతో నాలోచించు

చుండిరి. నిన్నటిదినము వారికి భోజనములేదు. నేడును లభించుననను యాసలేదు దినము లెట్లుజరుగును? పాప మాతల్లి తనకు లేకున్నను కుమా ర్తెకైన వండిపెట్టుదమని వీధు లన్నియు దిరిగివచ్చెను. కాని గుప్పెడు బియ్యమైన లభింప లేదు. ఆహారములేకుండ మనుష్యు లెట్లుజీవింతురు? అను శంకతో వారిద్దరు హతమనస్కులై కూర్చుండి విచారపడు చుండ, మనోహరుడుపంపిన సేవకులువచ్చి బియ్యపుమూట లను క్రిందబడవైచిరి. మనోహరునితలంపు వారి కేమి తెలి యును? ఆశ్చర్యముతో జూచుచుండిరి.

తల్లి: దీనిలో నే మున్నది?

భటు: బియ్యపు సంచులు

తల్లి: బియ్యమా! ఎవరికి? ఎచ్చటకు తీసికొనిపోవు చున్నారు?

భటు: మీకే. ఇచ్చటికే తెచ్చితిమి.

తల్లి: ఎవరు పంపి గారు?

భటు: మనోహర బాబుగారు.

తల్లి: అనగా కుమార జమీందారుగారా?

భటు: అవును.

తల్లి: రెండుబస్తాలబియ్యమును మా కేందులకు బంపి నారు?

భటు: ఆ సంగతి మాకు తెలియదు. వారి ఆజ్ఞాను సారముగ చేయుటయే మా కర్తవ్యము.

తల్లి : మీరు పొరబడియుందురు. ఈ బియ్యము వేరొకరికై పంపినారేమో.

భటు : మీకే పంపినారు. లోనికిం గొనిపోయి దాచు కొనుడు.

అని పల్కుచు సేవకులు వెడలిపోయిరి.

తల్లి : (కుమార్తె ముఖముజూచి) యువరాజుగారు మనకిన్ని బియ్యము నేల పంపియుందురు ?

కుమా : (సిగ్గుతో తలవంచుకొని) నేనుమాత్ర మెట్లు చెప్పగలను ? నీ కెంత తెలియునో నాకును నంతియే తెలియును.

తల్లికి మనస్సులో పెక్కుయోజనలు బయలుదేరెను. తమ కష్టపుపరిస్థితులను గమనించి దయార్ద్రహృదయుడై పంపి యుండునా ? లేక నిన్న సాయంకాల మింటికి వచ్చినపుడు కమల చక్కదనమునుజూచి మోహించియుండునా ? అందు నకే కాబోలు వివాహభారమంతయు తానే వహింపనున్నట్లు ప్రసంగించెను. అదే నిజమైన నా బిడ్డ జమీందారిణియా ? అంతభాగ్యమా ? తండ్రి అంగీకరించునా ? ఇది సంభవమా ? ప్రభువులు నిరుపేద బాలికలను ప్రేమించి పెండ్లాడు టెన్న డును వినని సంగతి.

ఈ విధముగ నా వృద్ధురాలు తలపోయుచు బియ్యమును లోనికి జేరవేయుచుండెను. కమల మారాడక పొయ్యిరాజేయు టకు బోయెను.

కమల హృదయములోఁగూడ తుపాను చెలరేఁగెను. ఈకార్యమునుబట్టి విచారింపగా మనోహరుఁడు తన్ను నిజముగ ప్రేమించినాఁడేమో యను సంశయ మామె చిత్తమును కలవర పెట్టసాగెను. మితిలేని తలపోఁతలకుఁజిక్కి యామె 'ఏమేమి ఆ సుందరుఁడు నన్ను ప్రేమించెనా? లేకున్న నింతపదార్థమేల పంపును? ఆతని చూపులనుబట్టియే గ్రహించితిని. నాఁపై జనించిన ప్రేమమును బాగుగ తెలిసికొంటిని. ఎంతమరలించు కొందమన్నను నా కతనిపైనున్న వీక్షణములను త్రిప్పుకొను శక్తి లేకపోయినది. ఇయ్యది నిజమా! లేక భ్రాంతియా!'

అని తలపోయుచు కమల సంశయాకులిత చిత్తముతో పాకమును సిద్ధముచేసెను. తల్లి కుమార్తె లిర్వురును సుఖముగ భుజించిరి. గంట క్రిందవరకు భోజనములేక విచారముతో దిగులుపడిన యా స్త్రీ లిర్వురకు పరమేశ్వరుఁడు కుక్షి నిండెడి యాహారమును కలుగజేసెనుగదా ఆహా! దైవవిలాసము! ఉత్తరక్షణమెట్లు మారునో గ్రహింపజాలము.

* * * * *

నాఁటి సంధ్యాకాలమునకు గుమస్తా వచ్చి యువరాజ మనోహరుని కలసికొనెను. ఇర్వురు నిట్లు ప్రసంగించిరి.—

మనో: ఎచ్చటికి వెళ్ళినారు?

గుమా: రాజభవనమునకు.

మనో : కారణ మేమి ?

గుమ : పన్నులు వసూలు చేయుటకై కొంచము కాలవ్యవధి కావలయునని యడుగబోయితిని. అందుల కవకాశ మియ్యలేదు. ఎల్లుండియే డబ్బంతయు - ఖజానాకు చేరవలయు నట. రేపు సాయంకాలమునకే మనపనియంతయు బూర్తి చేయవలయును.

మనో : తండ్రిగారిని కలిసికొంటిరా !

గుమా : కలిసికొంటిని మిమ్ములను వెంటనే బయలు దేరి రమ్మని యాజ్ఞయనది.

మనో : సరియే రేపు మధ్యాహ్నము వెళ్లెదను నా గుఱ్ఱమును సిద్ధము చేయింపుము.

చిత్తమని పలికి గుమస్తా కిస్తీద్రవ్యమును వసూలు జేయు పనిమీద బోవుచు సేవకుని పిలిచి రేపు సాయంకాలము లోగా ఆసామీల్లందరును కిస్తీడబ్బును తెచ్చి, చెల్లించనిచో శిక్షింపబడుదురని చాటింపు వేయించు మని పంపెను.

మరునాటి యుదయమునుండియు కిస్తీధనము వసూలు ప్రారంభమయ్యెను. సగముమందిపైగా వచ్చి పంటలు నాశన మయినవి భుక్తి గడచుటయే చాలకష్టముగానున్నది. అనుగ్ర హించినచో రాగలసంవత్సరములో తీర్చుకుందుమని మొర పెట్టుకొనిరి. కాని గుమాస్తా యెంతమాత్రము వినిపించు కొనక దయావిహీనుడై పన్ను వసూలు చేయుచుండెను.

కొంతమంది పేదరైతులకు తిట్లు పదాఘాతములు దెబ్బలు లభించెను. మొత్తముమీద గ్రామములోని నిరుపేదరైతుల గృహము లన్నింటిలోను రోధనధ్వనులును హాహాకారములు చెలరేగెను. ఆ దురదృష్ట మొఱలను రోదనములను వినువా రెవ్వరు ? భయంకరమైన వరదలవలన పంటలు పాడగుటచే ఆలుబిడ్డల కాహారమైన మిగులని దురవస్థ సంభవించినది. దొరకినంతవరకు షాహుకారనుండి ఋణము తీసికొని బ్రదుకు చున్న యా బీదలెట్లు పన్ను చెల్లింపగలరు ? అప్పటికి నూరక యుండక రైతులందరును కలిసి జమీందారుగారికి విజ్ఞాపన పత్రికను బంపుకొనుట - భూములయొక్కయు గ్రామముల యొక్కయు పరిస్థితులు- చక్కపడువరకు కిస్తీలతాలూకు పన్నులు వసూలుచేయు టాపవలయునని వ్రాసికొనిరి. దానిపై జమీందారు కొంతకాల మాగుటచేతను విజ్ఞాపనము సార్థక మయ్యెనని రైతులు కొంచెము శాంతపడిరి. ఇంతలో నాకస్మిక ముగ పన్నుల వసూలుకై జమీందారు తన సిబ్బందిని పంపెను. పాపమా దీనులేమిచేయుదురు ? అధికారప్రాబల్యము నెదుర్కొను శక్తి వారికెక్కడిది ? గుమాస్తామాత్ర మేమి చేయును. అధికారి చెప్పినట్లు చేయనిచో నతని యుద్యోగ ముండదు. అందువలన రైతుల మొఱలు రోదనములు మొండి గోడతో జెప్పినట్లయింది.

గ్రామములో జరుగుచున్న గందరగోళమునంతయును వినగా కమలతల్లికి మరియొక విచారము కలిగెను. రెండుసంవ

త్సరములనుండి యామె యకరముభూమిని సేద్యమునకు తీసికొనిన రైతు పంపవలసిన శిస్తులను పంపకపోవుటచే యాతల్లీ కూతురుండ్రిరువురు తిండి జరుగక బాధపడుచున్న సంగతిని పాఠకులు తెలిసికొనియున్నారు. ఆమె జమీందారీ పన్నుక్రింద నిరువదిరూపాయలు చెల్లించవలసియుండెను. ఎట్లీయగలదు ? గుమాస్తాపెట్టు బాధలను వినినకొలది యామెకు గుండె లదరి పోవుచుండెను. భగవంతుడా ! నాకేదిదారి ? నన్నీ యాపద నుండి యెట్లు రక్షింతువో నీదే భారమని యామె పరమేశ్వరునితో మొరపెట్టుకొన నారంభించెను. తటాలున లేచి తన బంధువుడగు నొకని యింటికేగి నాయనా ! నా భూమిని తనఖాయుంచుకొని ముప్పదిరూపాయలిమ్ము ఈ యాపద గడచినచో తదుపరి యోజింతము. అని వేడుకొనెను, అందులకతడు తాను నట్టి యవసరమునకే గ్రామమంతయు దిరుగుచుంటిని. డబ్బెక్కడను దొరకలేదని ప్రత్యుత్తరమిచ్చి వెడలి పోయెను.

ఆమెకు మిగిలిన యాకొంచెపు ఆశయు కూలిపోయెను. ఒకమారు భటులువచ్చి కేకలువైచిపోయిరి. ఈ మారు మరల వచ్చినచో నేమిచేయవలయునాయని దిగులుతో తాబోవు చురవస్థ నెదుర్కొన సంసిద్ధురాలై యుండెను. కార్యస్థానంలో పన్నులు వసూలు ప్రారంభమయ్యెను.

గుమాస్తా ప్రతియాసామీని పిలిపించి కఠినముగ పన్ను వసూలు చేయుచుండెను. పన్ను కట్టలేని రైతులందరును

తాడనములకు తన్నులకు కొరడాదెబ్బలకు గురియగుచుండిరి. మనోహరుడీ హృదయవిదారక దృశ్యమును జూడజాలక తన దృష్టిని గ్రంధపఠనముపైకి మరల్చెను. ఇంతలో కమల తల్లిని పిలుచుకొని రమ్మను కేక వినబడెను. మనోహరబాబా కేకను విని గుమాస్తాను పిలిచి యిట్లనెను.

మీలో చెప్పుట మరచితిని. కమలతల్లి నిన్న ఉదయం నాతో క్షమించవలయును. నాకు రెండుదినము లవకాశ మిప్పించినచో డబ్బు తెప్పించి పన్ను చెల్లించెదను. పేదరాలనీ యుపకారముచేసి పుణ్యము కట్టుకొనుడని బతిమాలినది. నేను సరేయంటిని. అందువలన ప్రస్తుత మామెను పిలిపించ వలదు.

గుమాస్తాకీ మాటలు సమ్మతముకాలేదు. తన యధి కారము తగ్గిపోయినట్లతడు భావించి యుపసాంజాజ్ఞ చెల్లకతీర వలయును. మీ మాటను వినజాలను భటులారా! పొండు. ఆ స్త్రీని పిలుచుకొని రండు. అని కేకవైచెను. మనోహరునకీ మారు కోపమువచ్చెను. గుమాస్తాను తీరస్కారదృష్టితో వీక్షించుచు—

మనో: నిన్ను నే నిచ్చ టాజ్ఞాపించు చున్నాను. ఆమెకు అవకాశమీయవలయును.

గుమా: యువరాజా! మీరీవిధముగ రైతులమాటలకు దీనాలాపములకు ప్రాధాన్యమిచ్చినచో నొకరూపాయకూడా మీరు వసూలు చేయజాలరు.

మనో : అట్లయినచో పన్నియలేక వాయిదా కోరెడి రైతులను ప్రాణముతీసి నీవు రాజకీయకోశములో లక్ష్మీదేవిని నాట్యమాడింతువుకాబోలు. ప్రజల కష్టసుఖములన్నీ ప్రభువే విచారింపకున్న వారేమికావలయును, ఒక పేదరాలికి పన్ను నిచ్చుటకై రెండుదినములు గడువొసంగినంత మాత్రమున సంభవించు నష్టమేమో వచింతువా ?

గుమా : పెద్దబాబుగారి ఆజ్ఞ.

మనోహరుడు కోపముతో వెడలిపోయెను. గుమాస్తా యువరాజు కోపమును గమనించి యా విషయమును వదలి వైచెను. కమల తల్లిని పిలిపించు ప్రయత్నమును మాను కొనెను.

యువరాజు తన ప్రయాణమును నాటికి నిలిపి సంధ్యా కాలమునకు కమలయింటికి బయలుదేరెను.

కమల తల్లితో కీచకవధను చెప్పమని యడుగుచుం డెను. తల్లి పరధ్యానముగా నేమో యాలోచించుచుండెను.

కమ : అమ్మా ! ఏమో యాలోచించుచుంటివి ?

తల్లి : చేతిలో పైసకూడ లేదు. జమీందారు పన్ను చెల్లించుమార్గము కనపడదు. గుమాస్తా కర్కోటకుడని విన్నాను పిలిపించి ఏమనునోయని భయముగానున్నది.

కమ : మన వీధిలో పన్నియని వారినందరిని బంధించి తీసికొని వెళ్ళినారు. ఇంకా మనకు మాత్రము వార్తరాలేదు. ఒకవేళ పేదరాలని కనికరించెనేమో !

తల్లి : జమీందార్లు గుమాస్తాలకు కనికరమా! ఎట్టి రాజో అట్టి ప్రజలు. ఎప్పుడో మనకు నాయువశిష్టము తీర గలదు.

కమ : అమ్మా! మనల నీ కష్టములు విడుచునట్లు లేదు. ఇప్పు డేమిగతి ?

మనోహరుడు వెలుపలనుండి వారిరువురిమాటలను విని మెల్లగ నిరువంకల బరిశీలించి లోని కేగెను.

యువరాజుం జూచి తల్లి కుమార్తెలిరువు రాశ్చర్యపడిరి. కమల యాతని సుందరవదనారవిందమును జూచి సిగ్గుతో తల వంచుకొని తల్లి వెనుక నిలువబడి యోరగంట నా యువకుని రూపమును వీక్షించుచుండెను.

తల్లి : రాజకుమారా! దయచేయుడు.

మనో : నేను జరుగురు పనిమీద వచ్చితిని ఎక్కువ నిల్చుండుటకు వీలులేదు.

తల్లి, మూలనున్న గోనెపట్టానుపరచెను. మనోహరుడు దానిపై కూర్చుండి నలుపక్కలజూడ నతనికి కమలవదన బింబదర్శనమయ్యెను రెండు మూడు నిముషము లిరువురవీక్షణ ములు మిశ్రమ కలుసుకొని ప్రసంగించుకొనెను. కమల వ్రీడా భర్మముచే నిలువజాలక వంటయింటిలోని కేగుచుండ చిరాను భావజ్ఞయగు తల్లి కుమార్తె చేయిపట్టుకొని అమ్మా! భయము లేదు. కూర్చుండుము. కుమారబాబు మనకు పరాయివారు కారు అని చెప్పి కూర్చుండబెట్టెను. అట్లొనర్చుటలో నామె

యభిప్రాయము పుత్రికా సౌందర్యముంజూచి యువరాజు తనకువ శుడగుననుటయే

మనో : పన్ను చెల్లించుటకై మీ కెంతకావలయును.

తల్లి : ఈ వాయిదా కిరువది రూపాయలుపైగా చెల్లింపవలయును.

మనో : మీ కోటకు గుమాస్తాగారు రేపు భటులను పంపి పన్ను చెల్లించమని నిర్బంధించును. ద్రవ్యము సమకూడినదా ! లేనిచో చాల నగౌరవము జరుగును. పన్ను దయా దాక్షిణ్యములులేకుండా వసూలు చేయబడుచున్నది.

తల్లి : ఒక్క కానియైన చేతిలోలేదు. గుమాస్తాగారెట్టి శిక్ష విధించినను, అనుభవించుటకు సిద్ధముగనుంటిమి. అన్ని ప్రయత్నములు వ్యర్థమైనవి.

మనో : అట్లయిన చాలకష్టము.

ఇంతలో పొరుగున గల నొక వృద్ధురా లరుగుదెంచి యేడ్చుచు తన కుమారునకు పాము కరచినదని రొమ్ము బాదుకొన నారంభింపగా కమలతల్లి జాలితో మనోహరబాబూ ! నే నిప్పుడే వచ్చెదను. కూర్చుండుమనిపల్కి యామెతో సర్ప దష్టుడైన బాలుని జూడబోయెను. కమల తల్లితో బయలు దేరగా యుక్తిపరుడగు మనోహరుడు కమలా ! నాకు మంచి తీర్థము తెచ్చియిమ్మని పలుకుటచే నా బాలిక వెనుకకు మరలి ల్లితవైపు చూచెను. ఇరువురి మనోభావములను గ్రహించిన తల్లి

కుమార్తెంజూచి బాబుకు మంచితీర్థమిమ్ము. నేనిప్పుడే వచ్చెద నని పల్కి వెడలిపోయెను.

కమల లోనికేగి మంచితీర్థముందెచ్చి మనోహరుని ముందుంచెను. మనోహరుడు వానిం ద్రావెను. కమల దూరముగ నిల్చుండెను. సంభాషణమున కిరువురి హృదయములు తొందరించుచున్నను సాహసించుటకు బెదరుచుండెను. చివరకు మనోహరుడే ధైర్యముతో సంభాషించుటకు ప్రారంభించెను.

మనో : కమలా ! మీ తల్లి డబ్బుకొరకు చాల చిక్కు పడుచున్నది. ఎచ్చటనైన ప్రయత్నింపకున్న నెట్లు ?

కమ : నే నేమిచేయగలను ? ఆ కార్యము నా తల్లికే గాని నాకు సాధ్యముకాదు.

మనో : పెద్దది వృద్ధురాలు. ఏ సమయ మెట్లుండునో ! యెవ్వరెరుంగుదురు ? ఒకవేళ నామె యీ రోజున ఋణమును తీసికొని రాగల్గినను రేపు పరిస్థితి విషమించినచో నా బాకీ తీర్మానము జేయవలసినది నీవేగదా ! కనుక నీకు నేను కావలసిన ధనము నిచ్చెదను. నాకు వడ్డీతోసహా నీవే తీర్మానించవలయును తెలిసినదా ?

కమ : నా దగ్గిఱ డబ్బులేదు. నే నెట్లు తీర్చవలయును ?

మనో : నీ వివాహ మైపోయినతర్వాత తీర్చవచ్చును.

కమల యీ మాటకేమియు ప్రత్యుత్తరము నీయలేదు ఎచ్చటలేని సిగ్గువచ్చి యామె నావరించుటచే తలను వంచు కొనెను. కపోలము లెర్రబారెను. రాహువిముక్త పూర్ణేందు మండలమువలెనున్న నామె ముఖమునుజూచుచు మనోహరు డానందమగ్నుడయ్యెను. ప్రేమపాశబంధితులగు నా యువతీ యువకు లిర్వురు ననిర్వాచ్యమగుస్థితిలోజిక్కి తన్మయత్వము నందుచుండిరి. మనోహరుడు తన భావమును దాచలేక నామె కిట్లెరుకపరచెను.

మనో : కమలా ! ప్రథమసందర్శనముననే నీ సౌం దర్యము నా హృదయము నపహరించినది నన్ను నేను మరచి పోవుచుంటిని. నీ వొకనాటికి విక్రయనగర రాజమందిరము నలంకరించి నా యైశ్వర్యమునకు రాణివికాగలవు. అప్పుడు నీ కీనాడిచ్చిన ఋణమును తీర్చవలయును. కమలా ! నామాట నిజము. సూర్యచంద్ర నక్షత్రాదులు సాక్షిగా నేను నిన్ను ప్రేమించితిని. నిన్నువిడిచి వేరొకరిని వివాహమాడను. నీవే నా యర్ధాంగివి. కమలా ! చెప్పుము నీవుకూడ నన్ను ప్రేమించుచుంటివా ? నా కట్టి యోగ్యతకలదా ? నీ వలన వినగోరుచుంటిని చెప్పుము. కమలా ! నన్ను పెండ్లాండెదవా లేదా ?

కమల హృదయమంతయు నాశ్చర్యానందములతో నిండిపోయెను. కంఠము డగ్గుత్తికపడెను. తన్ను తాను మరచి పోయెను. స్వప్నమాయని తలంచుచుండెను. మనోహరుని

మాటలకు మారాడజాలక నతనిముఖము నాశాపూరితవీక్షణ ములతో జూడనారంభించెను.

మనో : కమలా ! మాటాడవేమి ? నన్ను వివాహ మాడుట కంగీకరింపవా ? అట్లయిన నా జన్మవ్యర్థము.

కమ : మనోహరబాబూ ! మీ ప్రేమను తిరస్కరించు శక్తి నాకులేదు. కాని నేను నిరుపేదరాలను. మీరు రాజ పుత్రులు ఇద్దరిమధ్య హస్తిమశకాంతరమున్నది పొసగుట సంభవముకాదని నా శంక.

మనో : ప్రియా ! నీవు నా సామ్రాజ్యమునకు కమ లవు. నేనే నీ మనోహరుడను. ఇవిగో ఈ నోట్లకట్టను నీదగ్గర నుంచుకొనుము. కంఠమున ప్రాణము లున్నంతవరకు నేను నీ వాడను. తండ్రి యంగీకరించకున్నను భయములేదు. వేరొక యువతిని పెండ్లాడను. న్యాయసమ్మతమగు వివాహము జరుగు వరకు నేను మీకు సాయపడలేకపోవుదునేమో అంతవరకు మీరీ ధనము నుపయోగపరచుకొనుడు.

కమ : మీరు మరల రాజాలరా ?

మనో : రాజాలకపోవుటయు సంభవమే.

కమ : ఆసజూపికాని రానియెడల నా హృదయ మెంత పరితపించునో యించుక విచారించి చూడుడు.

మనో : నేనుమాత్రము నిన్నుజూడక నిలువగలనా ! సాధ్యమైనంతవరకు ప్రయత్నించి నిన్నుజూడ వచ్చెదను.

కమ : మా తల్లి కేదియో యొకవిధముగ మన ప్రేమ వృత్తాంతమును వివాహవిషయమును తెలుపవలయును. లేకున్న నామె యీ ధనముంజూచి నన్ను సందేహింపగలదు.

మనో : నే నిదివరకే యీ విషయము నాలోచించితిని. ద్రవ్యముకూడ నామెకే యొసంగెదను

కమ : అందుల కామె యంగీకరింపదేమో !

మనో : అందుల నొక యుపాయముం దెల్పెదను. జమీందారు పన్నుగూర్చి నే నొకవిధముగ నామెతో చెప్పి పోయెదను. నేను వెడలిపోయినతరువాత నీ నోట్లకట్ట నిచ్చట నేను పడవైచి వెళ్ళితినని మీ యమ్మతో రేపటిదినమున తెలియ జేయుము. దానిపైన నంతయును మీ తల్లియే గ్రహించును.

కమలా మనోహరు లిర్వురును చాల సమీపముగా నిల్చుండి మాట్లాడుచుండిరి వాకిట అడుగులచప్పుడు విని ఎవరికివారు వేరుగ నిలవబడిరి. తల్లి రాకను గమనించి కమల యెరుంగనట్లు మాట్లాడెను.

కమల : అమ్మా ! ఆ పిల్లవాని కెట్లున్నది ?

తల్లి : కన్నులు తెరచి మాట్లాడుచున్నాడు.

మనో : రూపాయల సంగతినిగూర్చి యేమి యోజించి నావో తెలిసికొన వచ్చితిని.

తల్లి : నేనేమి చేయుదును ? ఈశ్వరసంకల్ప మెట్లున్న నట్లగును.

మనో : దానివిషయమై నే నేదో యుపాయము చేసి గుమాస్తాతో చెప్పెదను. ఇంక మీ కాచింత యక్కర లేదు.

తల్లి : ( ఆనందముతో ) నాయనా ! మీకు మాకు గల పూర్వజన్మసంబంధ మేమో తెలియదు. నీవు నిన్న బియ్యంబు పంపకున్న మా గతి యేమగునో మాకే తెలియదు.

మనో : పూర్వజన్మ సంబంధమునుగూర్చి చెప్పలేను. గాని యీ జన్మలో కొంతసంబంధమును కుదుర్చుకొనుటకై ప్రయత్నించెదను

మనోహరుడు చిరునవ్వుతో నీ మాటలను కమలముఖ ముం జూచుచు వచించెను. కమల మందహాసవదనయై శిరః కంపనముతో ప్రత్యుత్తరమిచ్చి లోనికేగెను. తల్లికి స్వర్గమే చేతికి వచ్చినట్లయ్యెను.

తల్లి . నాయనా ! నీ వివాహమింకను కాలేదు. మా కమలకైనా నిది పేదయింటి కన్య యను లోకటియే. దాని అందచందములకు సుగుణములకు లోటులేదు నీవంటి వానికి తగినకన్య.

మనో : తండ్రిగారి నంగీకరింపజేయుట ముఖ్యకార్యము. ఇక నేను వెడలవలయును భోజనమునకు వేళైనది.

తల్లి : నాయనా ! మరియొకమారు వచ్చెదవా ?

మనో : రాను. రేపే మా యింటికి బోయెదను. నాన్నగారి ఆజ్ఞయైనది.

అని పల్కుచు సింహద్వారము దాటిపోవుచు కమలను మొకసారి వెనుకకు తిరిగి చూచెను. కాని యతని కోరిక

నెఱవేఱలేదు. ఒకనిముషము నిరీక్షించినను కమల సిగ్గుచే ముందునకు రాలేదు. మనోహరుడు సంచలితహృదయుడై వెడలిపోయెను.

౪

మనోహరుడు వెడలిపోయిన తదుపరి తల్లి కుమార్తెం జూచి—

నేను లేనప్పుడు నీతో నేమైన మనోహరుడు మాట్లాడెనా ? అని యడిగెను. తన ప్రశ్నకు కుమార్తె నాతో నేమియుమాట్లాడలేదని జవాబుచెప్పెను. ఆహా ! స్త్రీ చిత్తమెంత విచిత్రము ? " దేవ్వానజానాతికుతో మనుష్యః " అను రీతిని నారీహృదయమును దెలిసికొన నెంతవారికిని తరముకాదు. తన కష్టములకుగా విచారపడుచు తన సుఖమునకై యెట్టికష్టములకైన సహించి యెదుర్కొన సంసిద్ధురాలై యున్న తల్లియే ప్రియుని జూచినదృష్టిలో యన్యురాలైనదన్న నింకేమనవలయును ? ఆహా ! ప్రకృతివిలాసము.

తల్లి : మనోహరుని మాటలను విన నీపై ప్రేమయున్నట్లును నిన్ను వివాహమాడదలంచినట్లును తోచుచున్నది. అదియే నిజమైనచో మనకష్టములన్నియు తొలగినట్లేకదా ?

కమ : ఔను.

తల్లి : భగవంతుడు నా కట్టిదినమును కలుగజేయునా యని యనుమానము.

కమల యేమియు ప్రత్యుత్తరము చెప్పలేదు.

తల్లి : పన్ను చెల్లించువిషయములో మనతో చేసిన వాగ్దానమును మరచిపోడుగదా !

కమ : గుమాస్తాతో చెప్పి పోయెదనని చెప్పలేదా ? నీ కంత యనుమానమెందులకు ?

ఇర్వురును ప్రసంగము నాపివేసి లోనికేగిరి. నాటి రాత్రి కమలకు నిద్రరాలేదు. కన్ను మూసినచో మనోహరుని రూపమే కానవచ్చుచుండుటచే సదా యతనిరూపమునే ధ్యానించుచుండెను.

మనోహరుడు బసకువచ్చి గుమాస్తాను పిలిపించి గుర్రమును సిద్ధము చేయించితిరా ?

గుమా : సిద్ధముగ నున్నది

మనో : కమలతల్లి చెల్లించవలసిన మొత్తమెంత ?

గుమా : మనోహరబాబూ ! నేను మీరు చెప్పినట్లే చేసితిని ఇప్పటికి రెండేడ్లనుండి పన్ను చెల్లించుట లేదు. గర్భదరిద్రురాలు ఇంకొకవిధముగా వసూలుచేయు మార్గములేదు. వాయిదా యిచ్చుటయేగాని ఎచ్చటనుండి తెచ్చి యీయగలదు.

మనో : మొత్త మెంతయున్నది. లెక్క చూచిచెప్పుము. ఆ బాకీయంతయు నేనే చెల్లించెదను.

గుమాస్తా విస్మయముతో యువరాజు ముఖమును నొక్కసారి వీక్షించి వెంటనే దస్త్రమువిప్పి మొత్తమునంతయు నెరుకపరచెను. మనోహరుడు ట్రంకుపెట్టె తెరచి పన్ను రూపాయలను లెక్కించి గుమాస్తాకిచ్చి రేపటియుదయమే

కమల తల్లికి పన్నంతయును ముట్టినట్లు రశీదు పంపుమని చెప్పెను.

మనోహరుని కార్యము గుమస్తా కాశ్చర్యమును కలిగించెను. ఎస్టేటులోని పేదరైతుల పన్నంతయు ప్రభువులే చెల్లించు టెపుడు ప్రారంభమైనదో యపుడే కోశాగారము సన్నగించును. కాని దీనికి వేరొక కారణ ముండకమానదు. అని తలపోయుచు తన పనిమీద బోయెను. రాత్రి చాల గడచుటచే మనోహరుడు నిద్రించి ప్రాతఃకాలము కాకముందే కమలయొక్క స్వరూపమును దలంచుచు స్వస్థానమున కేగెను.

ఉదయ మేడుగంటలకే జమీందారు భటులు వేసిన కేకలతో కమలతల్లికి గుండెలు కదలిపోయెను. మనోహరుడు తాను చెప్పినమాటను మరచియుండునని భయపడెను. ఇప్పుడేమిగతి? డబ్బెక్కడ దొరకును? గౌరవ మెట్లు దక్కును? హా భగవంతుడా! ఇప్పుడేదిదారి? అని విచారించుచు పాదములు తడబడుచుండ సేవకుని సమీపించెను. కమలయు తల్లి వెంట బోయెను. మనోహరుడు పన్ను చెల్లించకున్నను తన చేతి కిచ్చిన ధనములో నుండి పన్ను కట్టవచ్చునని యామె ధైర్యముతో నుండెను. తల్లికీసంగతి యేమియు దెలియదు. సేవకు డామెచేతికి రశీదునిచ్చి యిట్లనియె.

కుమారరాజాగారు మీ తాలుకు భూమిపన్ను చెల్లించి రశీదు మీకు పంపి వారి గ్రామమునకు వెళ్ళిరి.

అనిచెప్పి వెడలిపోయెను. తల్లియొక్క యానందమునకు మితిలేకపోయెను. మనోహరుని ప్రయాణము కమల కెంతయు విచారకర మయ్యెను. లోనికిబోయి కన్నీరు తుడుచు

కొనెను. తన చింత తల్లికి దెలియునేమో యను భయమున నెట్టి భావమును ప్రకటింపలేదు. వెడలిపోవు సమయమున నా కొకమారు కనుపడకూడదా! అని యామె మాటిమాటికి దలపోయసాగెను.

౫

మనోహరు డిల్లుచేరినవెంటనే తండ్రినిగలసికొని కొంచెముకాలము మాట్లాడి కార్యాంతరమున వెడలిపోయెను.

ప్రేమమార్గమున ప్రవేశించిన పదికులలో నితడు నూతనుడు. హృదయక్షేత్రమున కమలా స్వరూపబీజము నాటబడి యంకురించుటచే ప్రణయావేదనగాక మరేమియు నతని మనస్సున కెక్కుటలేదు. ఆ సుందరి సాంగత్య మేవిధముగ లభించునా యని వేగతుల దలపోయుచుండెను. తండ్రితో దన యభిప్రాయమును వచించుటకు సాహసింప లేకుండెను. కుమారుని వివాహప్రసంగమును తండ్రియు దలపెట్టలేదు. ఆ ప్రస్తుత ప్రశంశయు క్తముకాదని మిన్నకుండెను. ఎట్లయిన నొకమారేదియోపని కల్పించుకొని గోవిందపురము వెళ్ళి కమలను జూడవలయును. హృదయగతభావములను ప్రియురాలి కెరుకపరచినగాని మనశ్శాంతి కలుగదని నిశ్చయించుకొనెను. నాలుగైదుదినములు జరిగినయనంతరము మనోహరు డేదియో మిషపైన బండినెక్కి గోవిందపురగ్రామమునకు వెడలెను.

అమాయకురాలైన కమల ప్రియుని వాగ్దానములను గూర్చి తలపోయుచు లెక్కలేనన్ని యాశాసౌధములను నిర్మించుకొనుచుండెను. ఆకస్మికముగ యువరాజు గ్రామము లోనికి వచ్చినసంగతి యామె చెవులబడెను. చంద్రకిరణముల కొఱకెదురుచూచు చకోరమువలె నా బాలిక తప్పక తన ప్రియుడురాగలడని నమ్మి గడియలు లెక్కపెట్టుకొనుచుండెను. రాత్రియంతయు కమల నిద్రపోవక మనోహరునిరాక కెదురు చూచుచుండెను. యువరాజు కారణాంతరములచే నా దినమున కమలయింటికి బోజాలకపోయెను. నిరాశతోగూడిన విచారముతో మనోహరబాబు తన్ను బహుశా మరచెనేమో ప్రభువులు నూతనప్రియులగుట వారిని నమ్ముటయే ప్రమాదమని యెంచుచు నదీస్నానమునకు బోయెను.

మనోహరుడుకూడ సేవకునితో నా వైపునకే నదీస్నానమునకువచ్చి రేవునకు కొంచెముదూరములో దిగి స్నానము చేయుచుండెను. ఆ సమయముననే కమలవచ్చి మనోహరుని వీక్షించెను. ఇర్వురును బరస్పర ముఖసందర్శనము గావించుకొనిరి. తత్కాలమున వారి హృదయములకు సంభవించిన యానందము వర్ణనాతీతమని వేరు నుడువనక్కరలేదు. అందలి యవస్థ యనుభవజ్ఞులకే తెలియవలయును.

మనోహరుడు స్నానము చేయుచున్నంతవరకును కమల చెలికత్తెలతో బ్రసగించుచున్నను సమయము కనిపెట్టి ప్రియుని ముఖమును వీక్షించుచునే యుండెను. మనోహరుని స్నానము పూర్తియగు తెరంగి కమల నీటిబిందెను భుజమున నిడుకొని ప్రక్కనున్న వేరొకయువతితో ప్రియుడు వినునట్లు సాంకేతి

కనుగ నిట్లనియె. సోదరీ ! చాలాకాలమైనది ఇంటికి పోయెదను మా అమ్మకు జ్వరము తీవ్రముగా వచ్చుచున్నది. మందిచ్చు వేళైనది. అని పల్కుచు వెడలిపోయెను. మనోహరుడా సాంకేతికమును గ్రహించుకొని పొడిబట్టలు కట్టుకొని సేవకునితో దన బసకేగెను.

మధ్యాహ్నకాలము ఎండ చాలతీవ్రముగ నుండుటచే వీధిలో జనసంచారము తగ్గిపోయెను తల్లికి పూర్తిగ జ్వరము వచ్చుటచే యొడలెరుంగక పడియుండెను. కమల ప్రాంతమున నెత్తుపీటపై కూర్చుండి రాటమున నేకులవడికి దారము తీయు చుండెను దారము తీయుటయందును రుమాళ్ళు నల్లుట— పిల్లలకు ఊలుదారముతో బూట్సుజత నల్లుటయందును కమలకు మంచినేర్పరితనము కలదు. గ్రామములోనివా రప్పు డప్పు డామె యల్లిన రుమాళ్ళను కొనుచుందురు.

మనోహరుడా సమయమున మెల్లగ తలుపులను దెరచి కొని లోనప్రవేశించెను కమల సంభ్రమముతో లేచి తా నల్లు చున్న రుమాలు రాట్నమును దూరముగా దాచుచుండ మనోహరు డామె చేతిలోని రుమాలును తీసుకొని చూచి మెచ్చుకొనెను

మనో : దాచెదవేమి ? నేను చూడగూడదా ! అల్లిక చక్కగా నున్నది. దీనిని నా కిచ్చెదవా ?

కమ : చేతగానిపని యగుటచే నాక్షేపింతురని దాచితిని. వలయునన్న తీసికొనవచ్చును. నా సర్వస్వము మీదైయుండ రుమాలు నడుగవలయునా ?

మనో : ఎంతవిలువ ?

కమ : మీరు నా కిత్తునని వాగ్దానము జేసినదానిని మరచితిరా !

మనోహరు డానందమును బట్టజాలకపోయెను. ఆమె మధురవాక్యములకు తన్మయుడై రెండుచేతులతో కమల భుజములను బట్టుకొని దగ్గరగాదీసికొని తన వక్షమున కదుము కొని కమలా ! అదేమో కొంచెము జ్ఞాపకముచేయుదువా ? అని ముంగురులు దువ్వుచు నడిగెను.

కమల స్వరము చిక్కినట్లయ్యెను. తన శిరస్సు నతని వక్షముపైనుంచి ప్రేమవీక్షణములజూచి యిట్లనెను

కమ : మెల్లగ మాట్లాడుము అమ్మకు మెలకువ రాగలదు.

మనో : జ్వరతీవ్రతవలన నామె కనులు మూతపడి యున్నవి. మన మాటలను వినజాలదు.

కమ : నాలుగుదినములనుండి యామెకు జ్వరము వచ్చుచున్నది. ఈనాడు మిగుల తీవ్రముగావచ్చినది.

మనో : ఎప్పటికి తగును ?

కమ : సాయంకాలమునకు.

మనో : నా దగ్గర క్వినైన్ ఉన్నది. మూడు మోతా దెలువేస్తే జ్వరమురాదు.

కమ : ఇంగ్లీషుమందులను అమ్మ తీసుకొనదు.

మనో : పోనిమ్ము. సంజీవినీ మాత్రలను బంపెదను. వానిని అల్లపురసము తేనెతో నిమ్ము.

కమ : అట్లనే.

తదుపరి కమలతో నొకయరగంటకాలము సరసల్లాపాదులతో కాలముగడపి తన బసకు వెడలిపోయి మాత్రలను సేవకునిద్వార పంపెను. నాలుగుదినములా యూరనుండి తిరిగి తనగ్రామమునకు వచ్చెను. వచ్చునపుడు కమలచేతికి మరల కొంతద్రవ్యమిచ్చి వాడుకొమ్మని చెప్పెను.

కమల తల్లికి జ్వరము బాగుగా తగ్గినది. మనోహరుని రాకపోకలు కమలతో నేకాంతముగ సంభాషించుట మొదలగు విషయముల నామె యెరింగినను పాపమా యమాయకురాలు తనకుమార్తె నతను పరిణయమాడునుగదా యను నమ్మకముతో నేమియు ననక సమ్మతించి యూరకుండెను. కాని తుదకీ సమావేశ మెట్లు పరిణమించునో వివాహితులుకాని నవయువతీ యువకుల యేకాంతసమావేశం కెట్టికష్టములకు మూలమగునోయను తలం పామెకు తోచలేదు. తన దినములు సుఖముగ జరుగుచున్నవి. తన కుమార్తె శ్రీమంతుని భార్యకానున్నదనియే తలంచియుండెను ఇంక కమలకు భావచింతయే లేదు. మనోహరు డామెకు సర్వస్వము అతనికొఱకై యెట్టికష్టమునైన సహించగల ప్రేమభార మాతనిపై మోపెట్టియుంచెను. కాని రహస్యము దాగునా!

కమలయొక్క రహస్యము గ్రామములో నొక రిద్దరు గ్రహించిరి. పెదవిదాటిన పృథివి దాటునన్న సామెతచొప్పున వారిద్వారా నీ సంగతి యూరందరికి తెలియవచ్చెను ఎచ్చోట జూచినను కమలంగూర్చియే చెప్పుకొనుచు నిందించుటయే కానవచ్చుచుండెను. భారమైన కళంక మా సుందరశిరమున

బడుటవలన నామెయొక్క సుఖమయజీవితము కష్టమయము నయ్యెను. వృద్ధురాలైన తల్లి తానొనర్చిన ప్రమాదమును గుర్తింపగల్గెను. దురాశకుజిక్కి దుష్కరకళంకమును-అపకీర్తిని పొందుటయేగాక గ్రామస్థుల సానుభూతికి దూరమైపోవుటవలన నామె నిరంతరము భయశోకములతో క్రుంగిపోవుచుండెను. తుదకు బంధువులుకూడ నా తల్లిబిడ్డలను బరిత్యజించిరి. వారింజూచి జాలిబడు ప్రాణి యొకడు లేడు.

అమాయకురాలైన పవిత్రమైన యొక నవయౌవనవతి యొక్క యభిమానధనము నపహరించిన యా మనోహరుడు గోవిందపురమున గలిగిన యలజడిని జననిందను విని భయపడెను. తానుపడిన తొందరపాటునకు పశ్చాత్తాపపడెను. గోవిందపురగ్రామమున కే ముగముతో రాగలడు? ఆమెను పెండ్లాడుటకైనను తండ్రి యంగీకరింపడను సంగతి తానెరింగి నదే. ఏమి చేయగలడు? ఇంక నెక్కువకాల మచటనుండిన తండ్రివలన దనకు నల్బోరిలో చివాట్లు తప్పవని తెలిసికొని యొకనా డెవ్వరికిని చెప్పకుండ కలకత్తాకు వెడలిపోయెను. పోవునప్పుడు తన మూలమున నల్లరిపాలై యమూల్యసతీత్వ మును తన కర్పించి నల్బోరిలో దూరవస్థనందనున్న కమలగతి యేమా యను యాలోచనయైన నతనికి కలుగలేదు. యుక్తా యుక్తవిమర్శనజ్ఞానశూన్యు లొనర్చు కార్యములయొక్క పరిణామదశ యిట్టిదేకాదా!

ప్రేమయొక్క మరియొకనామమే హృదయపరివర్తనము. మానవుడా హృదయ పరివర్తనమునకు జిక్కినపు డెదుటి వారి హృదయమును బాగుగ పరీక్షించి పరిశీలనజేసినచో

నా పరివర్తనమువలన హానికన్న సుఖమునేపొందును. అట్లు గాక ముందరయక తొందరపడినచో హానియేగాని సుఖము కలుగదు.

ప్రపంచకజ్ఞాన మెరుంగని కమల తొందరపడి మనోహరున కాత్మసమర్పణ మొనర్చుటవలన ఫలిత మేమైనది? సతీత్వమా భంగమైనది. అసహ్యయాతలకా లోబడవలసివచ్చె. కష్టపరంపరలా వెంటపడనున్నవి. ప్రపంచకమా తన్ను పరిత్యజించె.

కాలగతి తీవ్రమైనది. చేసికొనిన కర్మయొక్క ఫలిత మనుభవమునకు రాకమానునా? కమల కొక కుమారుడు కలిగెను. బిడ్డ యెట్టిదైనను మాతృహృదయము దయాభరితము కావున కుమార్తెకే లోటుపాటులురాకుండ సర్వోపచారములను జేసెను మనోహరు డిచ్చిన ధన మీసమయమున కొంతసహాయకారి యయ్యెను. రత్నమువలె మెఱయుచున్న మనుమనిజూచి వృద్ధురాలు మురిసిపోయెను. కమలమాత్రము శిశువును కంటనైన జూడలేదు. పురుటిదినములు గడచినను శిశువును దగ్గిర తీయలేదు. మాతృ తిరస్కృతినందిన శిశువు ఎంతకాలము జీవించును? పదియవనాడా సూతికాగృహము లోనే మరణించెను. బిడ్డడు మరణించినయనంతరము కమల తానొనర్చిన ప్రమాదమును తెలిసికొని కన్నీరుగార్చెను. తన మూలమున బిడ్డడు మరణించెను. ఇందుల కెవరు కారకులు! తన బుద్ధియా! లేక తనను భంగపుచ్చిన మనోహరుడా? ఏదియును నిశ్చయించుకొనజాలక భారమైన హృదయముతో తల్లిసాయమున నాటిరాత్రి పుత్రకళేబరమును

భూస్థాపమొనర్చి నదిలో స్నానమొనర్చి యిల్లుజేరెను. ఆమె కంతయు జీకటికోణముగానుండెను. ఒకప్రక్క పుత్రమరణము, ఇంకొకవైపున ప్రియపరిత్యక్తమగు జీవితము. ఆమెను దీర్ఘ విచారవారధిలో నడగద్రొక్కెను.

“ బలవానింద్రియగ్రామో విద్వాంసమపకర్షతి ” అని యార్యోక్తి తెలుపుచుండ పాపమా యబల యేమిచేయ గలదు. పండితులే మోసపోవుచుండ పామరులమాట చెప్ప వలయునా !

రెండు మూడు నెలలు జరిగెను. మనోహరు డిచ్చిన ద్రవ్యము సమాప్తమగుచుండెను. తల్లి మరల దీర్ఘరోగమునకు జిక్కెను. ఈ మారామె జీవించుటన్న యాసలేదు. గ్రామస్థులవలన నెట్టిసాయమును దొరకదు. హతభాగ్యయగు కమల యేమి చేయును ? నెల పదునైదుదినముల జబ్బుతో కమలతల్లి యీ లోకమున తన ముద్దుబిడ్డ నొంటిగవిడచి పర లోకము జేరెను. కమల యిప్పుడు నిస్సహాయ చేతకాని లేదు. ఉన్నయకరముభూమిని విక్రయించి తల్లికి దహనసంస్కారము పూర్తిచేసెను. ఒంటరిగ నీ యూరనుండు టామెకు దుర్భర మనిపించెను. కాని యెచ్చటికిబోవును ? తన యునికికి జోటిచ్చు వారెవ్వరు ? తనపైనున్న కళంక మెక్కడికేగినను వెంట బడుచుండ నేమిచేయగలదు ? భగవాన్ ! నీవు అనాథ నాథుడవు. తండ్రీ ! ఏదైన నొక యాకస్మికసంఘటనమున నా జీవితముకూడ సమాప్తము జేయరాదా ! అని యామె చింతింప దొడంగెను.

౬

తల్లి చనిపోయిన రెండు నెలలనుండియు కమల చాల జాగ్రత్తతో కాలమును గడుపుచుండెను. గ్రామమంతయును దనకు వ్యతిరేకమగుటచే నెప్పుడే ప్రమాదము సంభవించునో యని యామె మిక్కిలి భయపడుచుండెను ఇరుగు పొరుగున కాపురమున్న వితంతువొర్తు కమలయందుకు జాలిపడి రాత్రులయందామె యింటికిబోయి తోడుగ పండుకొనుచుండెను.

వికసించిన గులాబిపుష్పమువలెనున్న కమలయొక్క నిండుయౌవనము, సౌందర్యమే యామెకు భయకారణమయ్యెను. పెక్కుమంది దుర్మార్గు లామె యొంటరితనమును కనిపెట్టి పశుబలప్రయోగ మొనర్పదలంచి సమయముకొఱకెదురు చూచుచుండిరి.

ఒకనాడొక మహమ్మదీయుడా వితంతువును రహస్యముగ బిలిచి యామె చేతిలో పదిరూపాయలుంచి యిట్లనియె.

మహ : నన్నొకమారు కమలతో సమావేశపరచవలయును నీ కింకను డబ్బిచ్చెదను

వితంతువు రూపాయలను వానిచేతిలో బడవైచి యిట్లనెను. ఖాన్‌సాహేబ్! నా వలన నీ పని కానేరదు. పాపమా దీనురాలు నన్ను నమ్మియున్నది భగవంతుని దలచుకొని నీ వాంఛ వదలుకొనుము. దిక్కులేని యరక్షితపై నీకీ దురాశించ తగదు.

మహ : నా మాటను విని ఎట్లయినచెప్పి యంగీకరింపజేయుము. లేనిచో నల్వురితో రాత్రివేళ ప్రవేశించి బలాత్కారము చేయవలసివచ్చును.

వితం : సరియే. నీవు పొమ్ము.

మహమ్మదీయుడు వెడలిపోయెను. నాటిరాత్రి వితంతువు కమలతో మహమ్మదీయుని ప్రయత్నమును వాని వాక్యములను వివరించి యిప్పుడు కర్తవ్యమేమని యడిగెను.

ఆ మాటలు వినుటయే తడవుగ కమలకు పైప్రాణము పైన పోయెను. నేలపైబడి రోదనముచేయ నారంభించెను. మనోహరునకుగాక నితరుల కామె తన హృదయ మీయ దలంచుకొనలేదు. అవ్విధంబున నమ్మించి తననీస్థితికి గొని తెచ్చిన ప్రియుడగు మనోహరుని దలంచి వెక్కి-వెక్కి యేడ్చుచుండెను. ఆ యబలకాసమయమున జీవితమే చాల భారమైనట్లు తోచెను. హా! మనోహరా! నీవెంత దయాహీనుడ వైతివి? నావలన నేమి నేరమున్నదని నీవిట్లు పరిత్యజించితివి? నన్నెవ్వరు రక్షింతురు? హా! పుత్రా! నీకు పదిదినములే యాయుర్దాయమా! కన్నబిడ్డను కంటజూడని రాక్షసిని వదలి పోయితివా? హా! భగవంతుడాయని కడుపు పగులునట్లు వాపోవుచుండెను. ఆమె దుఃఖమునుజూచి యా వితంతు వాగలేక తానుగూడ కన్నీరు గార్చుచు కమలకు ధైర్యము చెప్పసాగెను.

తగిలిన కాలికే దెబ్బ తగులునన్నరీతిగ భగవంతుడు కష్టములమీద నే కష్టములను సంఘటింపజేయుచుండెను. తన యమూల్య సతీత్వమున కెక్కడ భంగము వాటిల్లునో యని కుమిలికుమిలి యేడ్చుచున్న కమలపై మరియొక విపత్తు వచ్చి ప్రవేశించెను. ఆ వీధిలోనున్న గౌరీశ్వరుని యింటిలో పిల్లవాని చేతి బంగారు కడియము చోరగ్రస్తమయ్యెను. ఈ పని చేసినది

కమలయేయని యందరనుమానించుచుండిరి. అట్లనుమానించుట కామె యొంటరితనము—దరిద్రదశయే కారణము. నిష్కారణముగ తనపై లోకులందరును మోపిన యీ చౌర్యాపరాధమున కామె హృదయ మెంత క్షోభిల్లెనో మేము వేరుగ వ్రాయ నక్కరలేదు. కమల కిప్పుడు రోదనముగాక వేరేమియు పనిలేదు. నిద్రాహారాదులను బరిత్యజించెను. తనపై జమీందారుగారి సన్నిధిని యభియోగము తేబడుననియు రాజభటులు విచారణకై తన్ను విక్రమనగరమునకు గొంపోవుదురన్న మాటలు, శూలములవలె నామెను బాధించుచుండెను. ఏ రాజమందిరమున తాను భావియధీశ్వరినై యువరాజ్ఞినై యుందునని గగన సౌధములను నిర్మించి యానందించెనో యీ ప్రదేశమునకు పతి పరిత్యక్తయై చౌర్యాపరాధమున బంధింపబడి నేరస్థురాలి వలె పోవుటకన్న నాత్మహత్యయే మేలని యామె నిశ్చయించుకొనెను. కాని యందులకు నూత్రము సాధన మేది? సమకూర్చువారెవరు? ఒక్కరైన నామె కష్టములకు జాలిపడి యనునయవాక్యమును బలుకలేరు. వృద్ధ వితంతు వాక్కతియే కమల కిప్పుడు గతి. ఏవిధమైనమార్గము కానరాక పోవుటచే కమల గుండెలను రాయి చేసుకొనియనాలోచనతో నాండరపడి మనోహరునకు దన కన్యాత్వము సమర్పించిన స్వయంకృతాపరాధమునకు బ్రతిఫలముగా నెట్టికడగండ్లనైన నెదుర్కొనుటకు సంసిద్ధురాలై యుండెను.

సాయంకాలమున జమీందారు భటులు కమలను న్యాయస్థానమునకు గొనిపోవ నరుదెంచిరి. అందులకు సంసిద్ధురాలై యున్న కమల కన్నీరు గార్చుచు వారి వెంట విక్రమ

పురమునకు బయలు దేరెను. దయార్ద్రహృదయయగు నా వృద్ధు రాలుకూడా కమలను విడువజాలక నామెతో బయలు దేరి పోయెను.

చీకటిపడకముందే విక్రమపురము జేరి జమీందారుగారి న్యాయస్థానమును సమీపించిరి. మేఘములమాటునగల రాహుగ్రస్త చంద్రబింబమువలె కన్నీటినిగార్చుచు రాజభటులవెంట తలను వంచుకొని పోవుచున్న యీ సుందరాంగిని చూచిన విక్రమనగరవాసులలో జాలిబడనివాడొకడును లేడు.

ఇంత చక్కని చిన్నదానిని దరిద్రకుటుంబములో బుట్టించిన విధాత నిందనీయుడని యొకడును పాప మీ యమాయకురాలిట్టి దొంగతనమును చేసియుండదని మరి యొకరును—దుర్మార్గుల కుతంత్రమేగాని యీమె నిరపరాధిని యని వేరొకరును తలయొకవిధముగ బలుకుచు నామెను వెన్నాడి రాజమందిర ద్వారమువరకువచ్చి నిలువబడిపోయిరి:

దైవగతిని తెలిసికొనువా రెవరునులేరు. మనోహరుని బెండ్లాడి మహావైభవముతో రాజప్రాసాదము జేరవలసిన కమల తన యత్తవారింటికి బంధినియై చౌర్యమును శిరమున మోపబడి వాకిట నిలువబెట్టబడెను. విధిసంకల్ప మెంత చిత్రము ?

కమలను సేవకులు వృద్ధురాలితోగూడ కచేరీలో నొక మూల నిలువబెట్టిరి. కమలపై ఫిర్యాదును దెచ్చిన గౌరీశ్వరు డును వేరొకచోట నిలుపబడెను. మూర్తీభవించిన శృంగార దేవతవలెనున్న యీమెయొక్క దురవస్థనుజూచి యటనున్న వారందరును కన్నీరు గార్చిరి. కొంతకాలమునకు సేవకు డొకడు

వచ్చి బాబుగారు వెలుపలికి వెళ్ళినారు. వచ్చినపిదప మిమ్ము లను పిలిపించి మీా విషయమును తెలిసికొందురు. అని చెప్పి వెడలిపోయెను. కమల యామాటలు విని వృద్ధురాలితో కచేరీనుండి వెలుపలికి వచ్చెను.

కమ : అంతవరకెచ్చట నుండవలయును ?

వృద్ధు : ఎచ్చటకు పోగలము. ఇచ్చటనేయుండవము.

కమ . నాకిష్టములేదు నిష్కారణముగ నీ ప్రదేశములో గూర్చుండుట నాకు సమ్మతముకాదు:

వృద్ధు· ఇంకొక గృహస్థులయింటిముందు కూర్చుందము

ఇద్దరును బయలుదేరి పేద బ్రాహ్మణ గృహము సమీాపముననుండ నా యింటి యరుగుపై కూర్చుండిరి.

ఇంతలో దివాణములోనుండి జమీాందారు అంతఃపురము దాసియొకతెవచ్చి వారిద్దరి సమీాపమునుండియే పోవుచు దుఃఖించుచున్న కమలనుజూచి జాలిపడి యావృద్ధురాలితో నీమె వృత్తాంతమేమని యడిగెను. వృద్ధురాలా దాసితో మనోహరబాబు గోవిందపురమునకు వచ్చినపుడు కమల యింటిలో ప్రవేశించినదిమొదలు నేటివరకు నడచిన వృత్తాంతమంతయు నెరింగించి నిరాశ్రితయైన యీాయభాగినిపై చౌర్యము మోపబడెనుగాని నిర్దోషియని వచించెను. దాసి అంతయును విని కమలను నిదానించిచూచి దివాణములోనికి పోయి యజమానురాలయిన దొరసానిం జూచి (మనోహరుని తల్లి) అమ్మా ! మన నుప్పుడు వినిన కమల వచ్చినది.

దొరసా : ఏ కమల ?

దాసి : చిన్నబాబుగారి విషయమై మనసు తెలిసిన సందర్భములో—గోవిందపుర గ్రామవాసిని—

దొరసా : ఓహో ! ఆమెయా ! దేనికి వచ్చినది ?

దాసి : ఒక చౌర్యాపరాధములో నామెను బంపించి తెచ్చిరి. అమ్మగారూ ! అంత చక్కని స్త్రీని నే నెన్నడును చూడలేదు. ఆమె ముందు చిన్నబాబుగా రేవిధమునను నిలువ జాలరని నాకు గట్టి నమ్మకము. సౌందర్యమునకు సరిహద్దు.

మనోహరుని తల్లియొక్క హృదయము చలించెను. తన కొమారుడు చేపట్టిన యా కమలను చూడవలయునను బుద్ధిపుట్టుటచే దాసితో నామెను వంటయింటి సమీపమునకు రహస్యముగ బిలుచుకొనిరమ్మని పంపెను. తన భర్త చూచిన కోపించునను భయమున్నను చూడవలయునను వాంఛ యధిక మగుటచే గూఢముగ బిలుచుకొనిరమ్మని పంపెను.

రాజమందిరమంతయు దీపములతో నిండియుండెను. ప్రాంతమునగల దేవాలమునందలి ఘంటానాదము శంఖనాదము శ్రవనానందమును గలిగించుచుండెను. పావుగంట కాలమునకు దాసివచ్చి యజమానురాలితో కమలను తీసికొనివచ్చినవార్త నెరింగించెను.

యజమానురాలు చేతిలోనున్న పని నట్లే వదలి పరిచారికతో వంటయింటివైపునకు వెడలిపోయెను.

ఇద్దరు స్త్రీలు నిల్చుని యుండిరి. యజమానురాలు వచ్చి చూచి మేలిముసుగువలన గుర్తింపజాలక కమలయెవరు ? అని ప్రశ్నించెను.

వృద్ధు : అమ్మా ! ఈమెయే కమల.

యజమానురాలు వృద్ధురాలి నటనుండ నియమించి కమలను వెంటదీసికొని తన గదిలోని కేగి దీపములకాంతిలో నామెయొక్క సౌందర్యమును జూచి ముగ్ధురాలయ్యెను. జగన్మోహనకరమయిన యీ చక్కదనము యజమానురాలి హృదయమును కలవరపరచెను. ఇట్టి సుందరి కోడలైనచో నిక నేమి కావలయును ఈ రత్నమును పేదయింట పుట్టించిన విధి నేమనవలయును ? ఈమెకు సంభవించిన విపత్తేమేమో యని విచారపడుచు నిట్లు ప్రశ్నించెను,

యజ : నీ విచ్చటి కేల వచ్చితివి ?

కమల మాటాడలేదు. అవిరామముగ దుఃఖాశ్రుప్రవాహము కన్నులనుండి ప్రవహించుచుండెను.

యజ : ఎందుల కేడ్చెదవు ? నీ కేమియు భయములేదు. నే నడిగినదానికి ప్రత్యుత్తరము నిమ్ము.

కమ : నన్ను జమీందారుగారు భటులద్వారా పిలిపించినారు. నే నిప్పుడు బంధితను.

యజ : కారణమేమి ?

కమల దుఃఖము నాపుకొనలేకపోయెను. ఆమె వక్షమున గల వస్త్రమంతయు దడిసిపోయెను.

యజ : ఊరడిల్లుము. జరిగినసంగతిని తెలియబరచినచో చేతనైన సాయము జేయుటకు ప్రయత్నింతును.

కమ : నాపై చౌర్యానేర మారోపింపబడినది మా వీధిలోనున్న గౌరీశ్వరుని యింటిలో బంగారుకడియము దొంగిలింపబడినది కొంతమంది దుష్టులు నన్ను సాధించుటకై యీ నేరమును నాపై మోపి గౌరీశ్వరునిచే ఫిర్యాదు

చేయించిరి. కాని నేనేమియు నెరుంగను. దారిద్రమును ననుభవించుచున్నను నీచురాలనుకాను. అమ్మా! మీ పాదముల సాక్షిగా నిజమును వచించుచుంటిని. పూర్వజన్మకృతపాపము ఫలించుటచే బుద్ధి చలించుటయు దానివలన నేనీ దురవస్థకు పాల్పడుటయు సంభవించినది. ఇది చాలక దొంగతనమునకు సిద్ధపడవలయునా! ఏ కానియూరికిబోయి బిచ్చము నడిగినను జేనెడుపొట్ట నిండకుండునా?

కమలయొక్క దీనావస్థనుజూచి యజమానురాలికికూడ దుఃఖము వచ్చెను. కన్నీరు రాల్చుచు కమలచేయి పట్టుకొనెను.

విచారింపకుము కమలా! నేను దొరగారితో చెప్పి నిన్ను విడిపింప బ్రయత్నించెదను. ఈపూట కిచ్చటనే భుజించి యిచ్చటనే పరుండుము.

కమల: అమ్మా! క్షమింపుడు. నాకా యోగ్యత లేదు. ఈశ్వరానుగ్రహమున్న ముందేమోగాని యిప్పటికి నాకనుజ్ఞనిండు పోయివచ్చెదను.

యజ: పోయిరమ్మా నేనీ రాత్రి సమయము కనిపెట్టి వారితో మాట్లాడెదను.

కమల యజమానురాలి అనుజ్ఞనుగొని వృద్ధురాలిని సమీపించెను. ఇర్వురును రాజమందిరమును వదలి పూర్వస్థానముంజేరిరి. మనోహరు డెచ్చటనయిన కానవచ్చునేమోయని కలయజూచెను. కాని యీయదృష్టహీనురాలికా భాగ్యము కలుగలేదు, ఆమె శరీరమందలి ప్రత్యవయవమును హా! నాధా! మనోహరా! యన్న స్మరణమునే జేయుచుండెను.

౭

యువరాజ మనోహరుని తండ్రిపేరు మోతీలాలు రాత్రివేళ మోతీలాలు భోజనము చేయుచుండగా యజమానురాలు (మనోహరునితల్లి) సమీపించి కమలనుగూర్చి ప్రశ్నింపనత డిట్లనియె :

ఆమె బంగారునగను దొంగిలించినట్లు ధృవపడుచున్నది ఆమె తన ఋజుప్రవర్తనమును నిర్దోషిత్వమును గురించి తగిన నిదర్శనములు చూపలేనియెడల న్యాయస్థానమున శిక్ష తప్పదు. తెలిసినదా ! ఇంక నీవు చెప్పునదేమి ?

యజమానురాలు సవినయముగ నిట్లనియె . నేను చెప్పదలంచిన దొకటే. నా బుద్ధికి దోచినంతవరకు విచారించిచూడ కమల నిర్దోషురాలు. గ్రామములోని దుర్మార్గులెవ్వరో యీ పని చేసి దిక్కులేని యీయువతిని సాధించుటకై యీమెపై ద్రోసినారు. గ్రామమంతయు వ్యతిరేకమైనప్పు డామె ఎట్టి నిదర్శనములు చూపగలదు ? చూపినను నమ్మువారెవ్వరు ? కుమ్మరి యావములో నిత్తడిచెంబులు, నీ కలికాలపు న్యాయస్థానములలో న్యాయ నిర్ధారణము మనము చూడము.

మోతీ : అధిక ప్రసంగము చేయకుము. గ్రామమంతయును బహిష్కరించుటవలననే యీమె స్వైరిణి యనియు దుర్మార్గురాలనియు తెలియుచున్నది. దుష్టులు తప్పక శిక్షింపబడ వలసినదే.

యజ : మీ న్యాయనిర్ణయము చాల బాగుగనున్నది. తప్పుచేసినవారిని వదలి నిరపరాధులను దండించు మీ సిద్ధాం

తమునకు మీారే మెచ్చుకొనవలయును. ఈ బెడదకు కారకుడగు తమ పుత్రరత్నమును శిక్షింపజాలక నిర్భాగ్యురాలు దురదృష్ట వంతురాలగు కమలను శిక్షించుట న్యాయవిరుద్ధముకాదా! గోవిందపురము వెళ్లినవాడు తనపని చూచుకొనిరాక నామె యింటికెళ్ళి యమాయికయగు బాలికను మోసగించి యామె కన్యాత్వము నపహరించి సమర్థించుకొనజాలక నామె జీవితము నీ విధముగ నాశనముచేసిన కుమారుని సభలో విచారించుట కిష్టములేక పరదేశములకంపిన న్యాయమూర్తులుకాదా తమరు? ఇదంతయు మగవారి పరిపాలనము. పదిమంది పురుషులు పట్టుబట్టి యొక మానవతిని పరాభవింప దలంచినపు డాటంకపరచువా రెవ్వరు? కానిండు చావగొట్టెదరు ప్రాణము తీసెదరు. ఇంతకన్న నధికము లేదుగదా! పైన భగవంతుడున్నాడు. న్యాయాన్యాయనిర్ధారణము నతడు చేయుచునేయుండును.

మోతీ: మేమామెను కొట్టము, చంపము నేరస్తురాలని ఋజువైన యనంతరము సభలో శిరోజములను తీసివేసి పార దోలెదము.

యజ: అన్యాయము అధర్మము. మానవతిని పరాభ వించిన రాజ్యము నిలువదు. రాబోవు మహాదురవస్థకు మీా రొడిగట్టుటకే మహిళాపరాభవమే సంకల్పము. ఆలోచించు కొనుడు.

మోతీ: నోరుమూాయుము. రాజకీయ విషయములలో స్త్రీల సలహాను గైకొను దురవస్థ యింకను పట్టలేదు. నీ యాలోచనలతో మాకు నిమిత్తములేదు.

అని పల్కుచు కోపముతో జమీందారు మోతీలాల్ చేతులు కడుగుకొని తన గదిలోని కేగెను. యజమానురాలు చేయునదిలేక దీర్ఘవిచారముతో కూలబడి కమలకు రాబోవు దుర్గతిని గురించి చింతించుచుండెను.

*  *  *  *  *

మరునాటి ఉదయమున విచారణము. కచేరీయంతయు కర్మచారులతో నిండియుండెను. కమల భటులవెంట వచ్చి దీనవదనయై కన్నీరుగార్చుచు నొకమూల నిలువబడియుండెను. ఫిర్యాదియొక్క విజ్ఞాపనము చదువబడెను. జమీందారు మోతీలాల్ కమల నిట్లు ప్రశ్నించెను. వెంటవచ్చిన వృద్ధురాలిని భటులు లోనికి గానీయక వెలుపలనే నిలిపి వేయుటచే కమల యొంటిగ నిలువబడియుండెను.

మోతీ : నీపేరు కమలయా ?

కమ : చిత్తము.

మోతీ : మేలిముసుగుతీసి మాటలాడవలయును. నీవు ఫిర్యాది యింటిలోని బంగారు కంకణమును దొంగిలించితివా ?

కమ : (ముసుగు తొలగించి) నేను దొంగిలించలేదు.

మోతీ : నీవే తీసినట్లు ఫిర్యాది నిదర్శనములను చూపుచున్నాడు.

కమల చక్కదనమునకు సభయంతయు నివ్వెరపడి పోయెను. సభ్యుల చూపులన్నియు నామెపై నుండెను.

కమ : మీా నిదర్శనములు నా కనవసరము. నేను త్రికరణశుద్ధిగ వచించుచుంటిని. కంకణమును నేను తీయలేదు. మీా రెట్లు నిశ్చయించినను సరియే. సామాన్యముగ నే దుష్కార్య మైనను గొప్పయింటివారు చేయవలయునుగాని నిరుపేదయింట బుట్టిన యభిమానవతులు నీచకార్యములకు జొరబడరు.

మోతీ : గొప్ప యభిమానవతివి. పెద్దవారి యనుమతి లేకుండా రహస్యముగ పిల్లవానింగన్న నీ యభిమానము లోకమునకు తెలిసినది. ఎట్టితల్లియో అట్టి బిడ్డ. తల్లి వ్యభిచారిణియు కూతురు పతివ్రతయగునా.

కమలకు కోప మధికమగుటచే పట్టజాలకపోయెను.

కమ : స్థానబలిమి కలదుగదా యని హద్దుమీారి మాటలాడిన లాభములేదు. స్వర్గస్థురాలైన నా తల్లి వ్యభిచారిణియో కాదో భగవాను డెరుంగకపోలేదు. వీధిమొగ మెరుంగని నన్ను మాయమాటల మోసపుచ్చి సూర్యచంద్ర నక్షత్రములుసాక్షిగ భార్యగ స్వీకరించెదనని నమ్మించి నా జీవితము నీ విధముగ జేసిన మహాత్మునికి తండ్రియగు తమ చిత్తవృత్తిని చరిత్రమును గూడ సర్వసాక్షి చూచుచునే యున్నాడు.

మోతీ : దుర్మార్గురాలా ! వ్యభిచారిణీ ! ఆడుదానవని తలంచి యూరకొన్నకొలది వదరుచుంటివి. నీ జీవితము ఎవరి చేతిలో నున్నదో యాలోచించుకొనుచుంటివా ?

కమ : బాగుగ నాలోచించితిని. యుక్తాయుక్త ధర్మా ధర్మ పరిజ్ఞానశూన్యమగు రాక్షసబలమునకు పశుబలమునకు నా జీవితము స్వాధీనమైనదని తెలిసికొంటిని. మీ పైశాచిక శక్తి నా భౌతికశరీరమును నాశనము చేయగలదు. నా యాత్మ నిశ్చయమును నా పవిత్రశీలమును నాశనము చేయజాలదు.

మోతీ : (పండ్లు కొరుకుచు) చూడుము నీ జీవితము నెట్లు నాశనము జేసెదనో, నిండుసభలో నీ శిరోజము దీయించి పంపెదను. నీవంటి జారిణి కదియే శిక్ష.

అని పల్కుచు భటునివైపు జూచెను. భటుడు వెలుపలి కేగి సిద్ధముగనున్న మంగలిని గొనివచ్చెను. కమల మంగలిని చూచి గడగడ వణికిపోయెను. తనకీ పరాభవము తప్పదని తలంచి మొండిధైర్యము నవలంబించి కూర్చుండెను. మంగలి జమీందారు ఆజ్ఞచే కమలముందు కూర్చుండి యామె సుందర దీర్ఘ వినీల కేశపాశమునంతయు దీసివేయుచుండెను. కమల యేడ్పునకు మితిలేదు. సభ్యులందరా భయంకర ప్రదర్శనమును జూడలేక కన్నులు మూసుకొని హాహాకారములు సల్పిరి. నాలుగు నిముషములలో నా జగన్మోహినియొక్క తలకట్టంతయు శిరమునుండి వేరై క్రిందబడెను. కార్యమును ముగించుకొని మంగలి యావలికేగెను.

కమల లేచి యెలుగెత్తి యిట్లనియె. సభ్యులారా! అత్యాచారము హద్దుదాటినది. నిరపరాధినియగు శీలవతియైన యొకదానిని పరాభవించి కేశాకర్షణ మొనర్చిన రాజ్యము లన్నియు నాశనములైనవి. స్త్రీని పరాభవించిన ప్రభువు వాలి

రాజ్యము సర్వనాశనమగుటకు సందియములేదు. ద్రౌపది కేశాకర్షణ మొనర్చి దుర్యోధనుడు సమూలముగ నాశన మయ్యెను. జగన్మాత సీత కపచార మొనర్చిన రావణుడు నిర్మూలమయినాడు. జ్ఞాపకముంచుకొనుడు. నేను నిరపరాధినిని. యువరాజ మనోహరునిగాక వేరొక పురుషుని కంట జూచి యుండనిమాట యథార్థమేయైనచో పరమేశ్వరుడు నా మొరాలించి యీ రాజ్యమును ధ్వంసముచేయక మానడు. నా కన్నీరుపడిన ప్రదేశము రుద్రభూమి కాకతప్పదు నేను జీవించియున్నచో రాక్షసుడైన మోతీలాల్ భిక్షుకుడై తిరుగు చుండ చూచెదను. ఇది నా శాపము.

అని పల్కుచు నా సభనువీడి యావలకేగెను. ఆమె కన్నులు నిప్పులను గ్రక్కుచుండెను. క్రోధరసపూరితమయిన యామె వదనము నెవ్వరు తేరిచూడజాలకపోయిరి. కమల కిప్పుడు దిక్కులన్నియు సందకారము లయ్యెను. హృదయ మామె స్వాధీనములో లేదు. తా నెచ్చటికి బోవుచున్నదియు నామెకు తెలియదు. వెంటనున్న వృద్ధురాలు చేయి పట్టుకొని కమలా! జరిగినదేమో జరిగినది. ఇంటికి పోవుదము రమ్మ. అని పలికెను.

కమ: నాయిల్లు నట్టేట కలిసినది. నా జీవితమును నాశనమొనర్చిన యీ పాపపు ప్రదేశమునకు రాను.

వృద్ధు: ఎచ్చటికి పోయెదవు?

కమ: మా మేనమామయింటి కేగెదను.

వృద్ధు : నిన్నచ్చట దిగబెట్టి పోయెదను. లేకున్న యీ వృద్ధ ప్రాణములు క్షోభిల్లును.

ఇర్వురును బయలుదేరి విక్రమనగరముదాటి సాయంకాలమున కొక పల్లెటూరుజేరి దేవాలయములో నాటిరాత్రికి పరుండ నిశ్చయించిరి. కమలయు వృద్ధురాలును నేలపై పరుండిరి. తెల్లవారి వృద్ధురాలు లేచిచూడ కమల కానరాలేదు. చుట్టుప్రక్కల వెదకినను కానరామి తనత్రోవ నేగెను.

## ౭

నిద్రపోవుచున్న వృద్ధురాలిని వదలి కమల నడచి పోవుచుండెను. గోవిందపురము వెళ్ళుటకు సమ్మతము కాకపోవుటచే మేనమామ యింటికని చెప్పెను. కాని యామె కెట్టి బంధుగృహమునులేదు. జీవితముపై నసహ్యతజనించిన యా మందభాగ్యురాలి కా వృద్ధాంగన వెంటనుండుట టాటంకముగ దోచుటచే నామెను వదలించుకొనుటకు వేరుమార్గములేక నిద్రలో నామెకు దెలియకుండలేచి రాజమార్గమున కేగెను తాను కానరాకపోయినచో కొంతతడవు వెదకి స్వస్థానము జేరగలదని నిశ్చయించెను. జీవితము భారమై తోచుటచే కమల నిర్భీతితో నా యర్ధరాత్రమున నడచిపోవుచుండెను. ప్రపంచకములో నామెకు స్వజనమూలేదు. ఆశ్రయమూ యదృశ్యమయ్యెను. పరాభవమూ కౌగలించుకొనెను అపవాదములు

స్థిరముగ శిరమున మోపబడెను. ఇట్టి విషమ పరిస్థితులలో నామెకు మృత్యువైన భయమును గల్గింపజాలదు.

రాత్రియంతయు నడచి తెల్లవారునప్పటికి త్రోవప్రక్క నున్న మర్రిచెట్టు క్రిందను విశ్రమించెను. తన దురవస్థను దలంచుకొని యాలోచనసేయ నారంభించెను. ఎచ్చటకు బోగలను ? నా కాశ్రయమిచ్చువా రెవ్వరు ? ఎచ్చటికేగిన నా దగ్ధహృదయమునకు శాంతి లభించును ? హా పరమేశ్వరా నా నుదుట నేల యిట్టిదుర్గతిని లిఖించితివి? నీవే యీనిరపరాధిని పట్ల విముఖుడవైనప్పుడు వేరెవ్వరు నా కాధారమవుదురు ? పొరపాటు ఇందు పరుల ననవలసిన యవసరములేదు. నా పూర్వజన్మకృతపాపమే నన్నిట్లు బాధించుచున్నది. అని తలపోయుచు సూర్యకాంతి విజృంభించుచుండుటచే లేచి నడువ నారంభించెను.

కొంతమంది బాటసారులు వెనుకనుండి వచ్చి యామెం గలిసికొనిరి. నవయవ్వనములోనున్న నామెయొక్క యాకృతిని జూచి వారిలోవారే గుసగుస లాడుకొనుచుండిరి. సాహసించి వారిలో నొక డామెను ప్రశ్నించెను.

బాట : నీ దేయూరు ?

కమ : విలాసపూరు.

బాట : ఏవైపున నున్నది ?

కమ : ఉత్తరదిక్కున.

బాట ; కష్టమెరుంగని సుకుమారివలెనుంటివి. తలకట్టు తీయించితివేల ?

కమల జవాబీయక ముందునడచి పోవుచుండెను. ఆమె యొక్క విచిత్రప్రవర్తనముజూచి పెక్కుగతుల ప్రసంగించుకొనుచుండ కమల వినజాలక కొంతదూరము ముందునకు వడిగా నడచిపోయి రాజమార్గముదిగి ప్రక్కనున్న చెట్లమధ్యకు బోయెను. బాటసారులు సాగిపోయిన తదుపరి మరల త్రోవలోనికివచ్చి పయనము సాగించెను. క్రమక్రమముగ నెండ యధికమై మధ్యాహ్నకాలమునకు నడినెత్తికి జేరెను. కమల జన్మమధ్యమున నెన్నడు నట్టి దీర్ఘప్రయాణము జేసి యెరుంగని దగుటచేతను ఆకలిదప్పులు తీవ్రమై బాధించుచుండ శిరోజవిహీనమైన శిర మెండతీవ్రతకు గాలుచుండ పైట చెంగు పైన వైచుకొని నిట్టూర్పులు విడుచుచు నడుగామడగా ప్రయాణముసాగించి యొక గ్రామమును జేరెను.

క్షుద్బాధానివారణమునకై యా యూరిలోని కొలది మంది గృహస్థులయిండ్ల కాశాభరితమైన హృదయములతో బోయి యన్నమునకై యాచించెను. కాని స్వార్థపరులైన యా గృహయజమానులలో నొకరైన నామెకు పట్టెడు కబళమునుకూడ బెట్టక సాగనంపిరి. కడుపెడాకలితోనున్న యా దీనురా లొకదుకాణములోనికేగి చెంబెడు జలమును మాత్రము త్రాగి పాదములు నొప్పిగానుండుటచే యొక యింటి యరుగుపై పరుండెను. లోకమంతయు విసర్జించినను నిద్రాదేవి మాత్ర మామెను బహిష్కరింపక తన యొడిలోనికి దీసికొని యించెను కాలము మనశ్శాంతి నొసగెను.

కొంతకాలమునకు కమలకు మెలకువ వచ్చునప్పటికి సూర్యాస్తమయమునకు కొంచెముకాలము వ్యవధియుండెను. కమల యా యూరనుండుట కిష్టపడక లేనిసత్తువను దెచ్చుకొని మరల ప్రయాణమును సాగించెను. కొంతదూరము పోవునప్పటి కొక భిక్షుకురాలు త్రోవను బోవుచు కమలను గలసికొని నిదానించి చూచి యిట్లు ప్రశ్నించెను.

భిక్షు : నీ వెవ్వరవు ?

కమలకు దుఃఖము పుక్కిలింతలగుటచే కంఠము బిగిసి పోవ జవాబీయజాలకపోయెను.

భిక్షు : నీ పేరేమి ?

కమల కన్నీరుగార్చుచు రోదనము జేయ నారంభించెను.

భిక్షు : ( సమీపించి ) అమ్మాయీ ! ప్రత్యుత్తర మీయవేమి ? నీ వెవరవు ? నీ దేయూరు ?

కమ : నాది విలాసపురము.

భిక్షు : ఒంటరిగ పోవుచుంటివేమి ? నీకు సంభవించిన కష్టమేమో చెప్పెదవా ?

కమ : నా కెవ్వరును దిక్కులేరు. ఒంటరిదానను. ప్రారబ్ధ మీడ్చుకొని పోవుచున్నది

భిక్షు : ఎచ్చటికి బోయెదవు ? నీ కుల మేమి ?

కమ : మేము వైశ్యులము. గ్రహాచార మెచ్చటికీడ్చుకొని పోవునో నే నేమి చెప్పగలను ?

భిక్షు : అమ్మాయీ ! నీ వేదో మహావిపత్తులో మునిగినట్లు గ్రహించితిని. నాతో రమ్మా. వైష్ణవధర్మమును

స్వీకరించిన వైశ్యకులముననే నేను జన్మించితిని. నా యింటికి రమ్మా. ఈశ్వరుడిచ్చినంతలో నిరుపుర మనుభవింతము. నీకు మంచిదినములు సంభవించిన తదుపరి కర్తవ్య మాలోచింప వచ్చును.

వేరుమార్గము లేకపోవుటచే కమల యా భిక్షుకురాలి యాహ్వానము నంగీకరించి యామెతో బయలుదేరెను. భగవాను డార్తత్రాణపరాయణుడు ఆ పన్నుల నేదో యొక విధముగ రక్షింపక మానడు.

౬

భిక్షుకియొక్క పేరు వైష్ణవి. ఆమె నా పేరుతో బిలిచెదరు. నాలుగు మాసములు గడచెను. వైష్ణవి కమలల మధ్య గాఢమైన స్నేహము కుదిరెను. కమల వైష్ణవిని తల్లిగాభావించి యుపచారములు సేయుచు దన కాలము వెళ్ళబుచ్చుచు తన సద్గుణములు సత్ప్రవర్తన వలన వైష్ణవియొక్క ప్రేమ నార్జించెను.

భిక్షావృత్తియే వైష్ణవికి జీవనాధారము. కాని ఒక వ్యక్తి సంపాదించిన భిక్ష యిర్వురి కుక్షినిండుట కష్టమగుటచే నప్పు డప్పుడు కమలయు నామెతో నేగి తన యాత్మగౌరవము సిగ్గును చంపుకొని భిక్షమును దెచ్చుచుండెను. శిరమున కేశమును వృద్ధిచెంది కంఠము దాటుచుండుటచే నామెయొక్క

సుందరము పునరాగమన మగుచుండెను ఆరుమాసములు దాటునప్పటికి శిరోజములు నమమునరకు పెరిగినవి.

ఒక దినమున వైష్ణవి కమలతో నిట్లనియె.

వైష్ణ : కమలా ! కిషన్ ప్రసాదుగారింట్లో వివాహము జరుగుచున్నది మనమక్కడకు బోవలయును.

కమ : ఇంటిలో పనియున్నది.

వైష్ణ : వచ్చినతరువాత చేయవచ్చును

కమ : ఇచ్చటి కెంతదూరము ?

వైష్ణ : నాలుగు మైళ్ళు

కమ : అంతదూరము పోనేల ?

వైష్ణ : వారు ధనికులు. సంభావన చాల దొరకును.

కమల కిష్టము లేకపోయినను వైష్ణవియొక్క గృహపరిస్థితులను గమనించినదగుటచే యంగీకరించి బయలుదేరెను

రెండుగంటలకాలము నడచి నార్వురు కిషన్ ప్రసాదు భవనము జేరిరి. పెండ్లి చాల వైభవముతో జరుగుచుండెను. భిక్షుకజనము చాలవరకు చేరియుండెను. ద్వారముకడ నిర్వురు పురుషులు నిలువబడి యుండిరి. నొకడు కుంటి గ్రుడ్డి పేద జనముల నొకొక్కని పిలిచి ధర్మమువిచ్చి పంపుచుండెను. కమల దూరముగ నిలిచి యా విధానమును బరికింపుచుండ వైష్ణవి వచ్చి రాజేను వెంటరమ్మని పిలిచి ధనమును పంచిపెట్టుచున్న పురుషుని సమీపించెను. వెనుకనున్న కమల తలయెత్తి యా పురుషునిజూచి కొయ్యబారిపోయెను. శరీర మాపాద

మ స్తకము కంపించెను. యట నిలువలేక దూరముగాబోయి యదేపనిగ నాతని జూడ నారంభించెను. ఆత డెవరు ?

దైవగతి విచిత్రము. ఆ ద్వారముకడ నిలువబడి బీదలకు ధర్మము చేయునున్నది మనోహరుడు. జమీందారు మోతీ లాలునకు కిషన్ ప్రసాదునకు దగ్గిరబాంధవ్య మగుటచే మనోహరబాబీ వివాహమున కాహ్వానింపబడి వచ్చియుండెను. కమల తన ప్రియుని రూపమును రెప్పవాల్చక జూచుచు నిలువబడెను. మురికిబట్టలతో సగము తలకట్టుతో నున్న యామె నెవ్వరు గుర్తింపగలరు ? ఆమె హృదయమందు చల్లారి పోయిన సంతాపాగ్ని మనోహర సందర్శనమున మరల ప్రజ్వలించెను. ఎచ్చటలేని దుఃఖము వచ్చెను. కన్నీరుపిడుచుచు హా నాథా ! నీవు ప్రేమతో గ్రహించిన యీ నిర్భాగ్యురాలి దురవస్థను జూచుచుంటివా ? నిన్ను నమ్మిన నా జీవిత మెట్టి దురవస్థకు లోబడెనో నీకు తెలియదుకదా ! నాథా ! నీవే నా సర్వస్వము నీవే నా యుపాస్యదైవము ఎన్నటికైన నీ దర్శనము లభించునన్న యాసయే ఘోరపరాభవాగ్నికి జిక్కి చావ దలంచియు మరణింపజాలని నా జీవితమున కాధారము నిదర్శన మైనది. కావున నిక నేను దేహమును త్యజించినను చింత లేదు.

అని విచారించెను. ఒక్కమారు మనోహరుని పాదముల బడి తన కష్టచరిత్రమును విన్పింపవలయునన్న తలంపుకలిగెను కాని వెంటనే తన యునికియు తన వేషమును జూచికొని

యా యుద్దేశ్యమును వదలుకొని యదేపనిగ మనోహరుని జూచుచుండ వైష్ణవి సంభావనము గ్రహించి తనను వెదకుచు వచ్చుచుండుట కమల గ్రహించి వెంటనే కన్నీరు తుడుచు కొని ముఖము త్రిప్పుకొని నిలువబడెను. వైష్ణవి వచ్చి భుజమును తట్టెను.

కమలా ! సంభావన గ్రహించితివా ?

కమ : నన్ను వెనుకకు త్రోసివేసి యందరు ముందుకు పోయిరి. ఆ గుంపులో జొరబడలేక వెనుకకు వచ్చితిని.

వైష్ణ : ఎంత తెలివితక్కువదానవు. అందరును తెచ్చుకొనిరి. నీ వొక్కరితెవే పుచ్చుకొననిదానవు. నిష్కార ణముగా రూపాయి పోగొట్టుకొంటివి. ఇంటికిరా ?

కమలకు వెడలవలయునన్న తలంపే లేదు. మాటి మాటికి మనోహరుని జూచుచు వైష్ణవి చెప్పుమాటలకు పరధ్యానముగ నుత్తర మిచ్చుచుండెను. ధర్మమంతయు పూర్తి యగుటచే మనోహరుడు లోపలి కేగుటచే కమల వైష్ణవితో బయలుదేరెను. మాటిమాటికిని వెనుకకు జూచుచు నడుచు చుండెను. కమలవలన మరియొక రూపాయ లాభము పోయిన దని వైష్ణవి విచారపడుచుండెను. కాని యా దీనురాలి హృదయమున నాకస్మికముగ ప్రజ్వరిల్లిన దావానలమెట్టిదో యామె కేమి తెలియును.

౧౦

మధ్యాహ్నకాలము దాటునప్పటికి కమలా వైష్ణవి యిర్వురు జేరుకొనిరి. వైష్ణవియొక్క యాధారమున కమల మరి యొక నెలదినము లచ్చటనే గడపెను. కానిచోట్ల కడగండ్ల బడుచు నామె యెట్లో తన దుర్భరజీవితమును వెళ్ళించుచుం డెను. కాని యామె కష్టములంతటు దీరలేదు. పుండుమీద కారము పడినట్లు మరియొక విపత్తు వాటిల్లెను.

ఒక దుర్మార్గునిదృష్టి కమలపై బడెను. వైష్ణవికి తగిన ధనమిచ్చి యామె సాహాయ్యమున తన కోరికను నెరవేర్చ కొనదలంచి యొకనా డేకాంతముగా వైష్ణవిని పిలిచి కమలను తనకు సమకూర్చినచో నీకు గొంతధన మిచ్చెదనని పలికెను.

కమలపై పరిశుద్ధానురాగముగల వైష్ణవి యందుల కంగీకరింపలేదు ఆ కామాంధుడు మరునా డామెను గలసికొని చేతిలో నొక పాతికరూపాయల నుంచి యిట్లనియె. నీ వామె నెట్లయిన నాకు సమకూర్చితివేని నీ కింకను ధనము నిచ్చెదను కొంతకాలమువరకు బిచ్చ మెత్తుకొననక్కరలేదు. ఆ సుందరి మాట చెప్పనక్కరయేలేదు. నా హృదయరాణినిగా జూచు కొని సుఖింపజేసెదను. బాగుగా నాలోచించుకొనుము.

చేత పాతికరూపాయలు పడునప్పటికి వైష్ణవికి మనస్సు చలించెను. కమలపై గల వెనుకటిబుద్ధి మారిపోయెను. నే నామెతో మాట్లాడి నీకు రేపు ప్రత్యుత్తర మిత్తునని పలికి వానిం బంపెను.

నాటిరాత్రి కమలతో యా వృత్తాంతము నెఱింగించి యింతకాల మీ యొంటిజీవితమును గడపెదవు అంగీకరించి సుఖపడుమన కమల తటాలున నామె పాదములబడి ఏడ్చుచు తల్లీ ! నిన్ను మాతృసమానురాలిగా దలంచి సేవించుచు నా కష్టకాలమును నీ యండను గడుపుకొనుచుంటిని. నేను పతి పరిత్యక్తనైనను దుర్మార్గురాలనుకాను. నన్ను పాపకూపములో ద్రోయవలదు. నీవే దిక్కని నమ్మిన యీ దీనురాలి జీవితము నాశనము చేయవలదు. అని పల్కుచు దుఃఖించెను.

కమల రోదనము వినిన వైష్ణవికి జాలికలిగెను. మరునాడు వానితో కమల యంగీకరింపలేదు. నీ వాయాసను విడువుమని పల్కెను. కాని లోకస్వభావమును బాగుగ నెరింగిన యా కామాంధుడు వైష్ణవిచేత నొక నవరసు వుంచి యిట్లనియె.

వైష్ణవీ! నా కామె యంగీకారముతో నవసరములేదు. ఆమె యంగీకరింపకపోయినను నా కార్యమును నేను నెరవేర్చు కొనగలను. నాకు నీ యనుమతియే కావలయును.

చేత బంగరునాణెము పడినంతనే యామెకు మనస్సు మెత్తబడ నారంభించెను. ఆశాపిశాచమువచ్చి శిరమున దాండవింప దొడంగెను. కొంతతడ వాలోచించెను. తుదకు ద్రవ్యాశ యా భిక్షుకీరాలియొక్క ధర్మాధర్మ వివేకమును నాశనముజేసి తా నాక్రమించుటచే కమల నా దుర్మార్గునకు స్వాధీనము జేయుటకే నిశ్చయించెను. రాత్రి రెండు

యామములు దాటినపిదప వచ్చినచో నీకామె స్వాధీనురా లగును. మెలకువగా నున్నంతవరకు నీకామె లొంగదు. నీ యుద్దేశము నామె నిద్రావస్థలోనే తీర్చుకొనవలయునని చెప్పి వానిని బంపెను.

రాత్రి గడచుచుండెను. కమల పరుండెనేగాని నిద్ర రాలేదు. ఏ క్షణమున నే యవస్థ సంభవించునోయని దిగులు పడుచుండెను. గుండెలు కొట్టుకొనుచుండెను. హృదయము కంపించుచుండ కదలక పరుండి తన ధర్మరక్షణోపాయమును యోజించుచుండెను.

నా కిప్పు డేది గతి ? నారీజీవితమున కమూల్యభూషణ మగు శీలము నశించినచో లోకమున నాత్మహత్యయు పరలోక మున దుర్గతులు తప్పవు. ఏ నిక్షేపము నింతవరకు గష్టముల కోడిగట్టి కాపాడుకొనగల్గితినో యా యభిమానధనము నీ భిక్షుకి ధనాశచే నాశనముజేయ బూనుకొనినది. ఇంక నాకీ ప్రదేశ మున క్షేమములేదు. ఓ రూపమా ! నీవేల నన్నాశ్రయించితివి! నీ మూలమునగదా ! నా కీ కడగండ్లు.

అని తలపోయుచు పరుండియుండెను. సగము రాత్రి జరిగెను. వీధి తలుపు చప్పుడయ్యెను. వైష్ణవి లేచి కమలను నిదానించి చూచి నిద్రించుచున్నదని నిశ్చయించి మెల్లగలేచి తలుపుతీసెను. కమలకు గుండెలు ఝల్లుమనెను. లోనికి పురుషుడు ప్రవేశించినట్లు తెలిసికొనెను. తన సర్వనాశనము సమీపించెనని గ్రహించి యీ యాపదనుండి యావలబడు

ను పాయమేమా యని తలపోయ నారంభించెను. ఇంతలో వైష్ణవి కమలను సమీపించెను.

కమ : ఎవరా వచ్చినది ?

వైష్ణ : కేకలు వేయకుము.

కమ : అత డెవ్వరు ?

వైష్ణ : నిన్న సాయంకాలము నీతో నేను చెప్పలేదా. అతడు గొప్ప ధనికుడు. నీ అదృష్టము పండినది లెమ్మ.

కమ : సరియేకాని యొకమారు వెలుపలకురమ్మ. మాటలాడవలయును

వైష్ణవి యందుల కంగీకరించెను. కమల యామెను వెనుకభాగమునకు గొనిపోయి యిట్లనియె.

నీవు చెప్పినదాని కంగీకరించితినిగాని కామాంధుల వాక్యములకు నిలుకడయుండదు. తుమ్మెద పుష్పమునాఘ్రాణించి మకరందమును గ్రహించి విడిచినట్లు కాముకుల నమ్మిన వారిజాక్షులగతి యింతే. దీపముండగనే యిల్లు చక్క బెట్టుకొన వలయును. కావున నీవేగి వానితో నామె మురికిబట్టలతో నలంకారశూన్యముగావచ్చుట కంగీకరించుటలేదు. ధరించుటకు మంచి వస్త్రములు మెడలోని కొక యాభరణముకూడ తెచ్చి యిచ్చినగాని యొప్పుకొనదు. ఒక నూతన యువతిని స్వాధీనము చేసికొనవలయునన్న నామె కోరికలను దీర్చక తప్పదు రేపు ప్రాతఃకాలము నీవు వానిఁ దెచ్చి యిచ్చినచో రాత్రివేళ నీ కోర్కె తీర్చుకొనవచ్చునని చెప్పుము పొమ్మ. ఆ నగలు వస్త్రములు నీవే తీసికొనవచ్చును.

ధనాశాపిశాచావేశితయైన వైష్ణవి యా మాటల నంగీకరించి వీధివైపునకేగి వానితో కమలచెప్పినదంతయు వివరించెను. వివేకశూన్యుడైన యా కామాంధుడు కమల వాక్యములను నిజములని నమ్మి యామె తనకు వశపడినట్లే నిశ్చయించి యంగీకరించెను. రేపు దయమే పంపించెదనని చెప్పి వా డేగెను. ఏదోయొకవిధముగ నేటికి గండ ు తప్పెనని కమల ధైర్యముతో లోనికివచ్చెను. ఇర్వురును శయనించిరి వైష్ణవి నిద్రకు జిక్కెను. కమల కొంచెముకాల మట్లే శయనించి మెల్లగ లేచి చూచెను. వైష్ణవి నిద్రించుచుండెను. ఇంతకన్న వేరు తరుణము లేదని తలంచి మెల్లగలేచి చల్లగ నడుగులుపెట్టుచు వీధి తలుపులను తెరచి బయటికివచ్చి వెలుపల గొళ్ళెమును బిగించి యా యర్ధరాత్రమున వ్యాఘ్రముబారినుండి విడివడిన కురంగమువలె పోవుచుండెను. ఎచ్చటికి బోవలయునో గమ్యస్థానమేదియో యామె కేమియు దెలియదు. ప్రాణము లెచ్చటకు తీసికొని పోయిన నచ్చటికే పోవుచుండెను.

తెల్లవారుజామున మూడుగంట లగునప్పటి కామె గ్రామముదాటి మూడుక్రోసులదూరము గడచి యొకచో గూర్చుండి కర్తవ్యమునుగూర్చి తలపోసెను.

ఇప్పుడు మరణమే కర్తవ్యము. వేరుపాయములేదు. పూర్వజన్మశత్రువువలె నన్ను బాధించుచున్న యీ పనికిమాలిన రూపముతో నెచ్చటికేగినను ముప్పు తప్పదు. ఏ జన్మలో చేసికొనిన పాపములో యీ జన్మమున వెంటాడుచున్నవి.

ఈ పాపకర్మానుభవమున కంతములేదా ! లేక నేమి ? ఆత్మత్యాగమున్నికష్టములను దూరముచేయును. తప్పదు. నేను మరణింపవలయును.

అని నిశ్చయించుకొని బయలుదేరెను. శరీర త్యాగమునకు మార్గమెట్లా యని యాలోచించుచు నడచుచుండ తెల్లవారుఝామయ్యెను. పక్షులు పీచుపీచు మనుచుండెను విశాలమయిన నదియొకటి ప్రవహించుచుండెను. కమల యా నదీతీరముఁ జేరి ప్రాణములను త్యజింప నిశ్చయించెను.

గట్టున నిలువబడి తన యిష్టదేవతలను ప్రార్థించెను. తుదకు భర్తయైన మనోహరుని తలచుకొని నాథా! నమస్కారము శాశ్వతముగా నేనీలోకమును పరిత్యజించుచుంటిని. కష్టకాలములో నొకమారు మీ దర్శనము లభించినది. అదియే నాకు దక్కిన పుణ్యము. నీ పాదములనుకాక నీ జన్మములో వే రేమియు నెరుంగను. పరలోకమున కేగినను నీ పాదములనే స్మరించెదను. భజించెదను. అని తలంచుకొని తనకు సంభవించిన కష్టముల నన్నింటిని స్మరించి యొక్కమారు పెద్దపెట్టున వెక్కి వెక్కి యేడ్చెను. ఆ యరణ్యరోదనమును వినువారెవ్వరు ?

కొంతవడికి లేచి ముందునకేగి యెత్తయిన ప్రదేశమును జూచి యటనుండి నడుమును బిగించుకొని హా నాథా ! మనోహరా! యని యరచుచు గుబాలున నానదీప్రవాహములో దుమికెను. వేగముగా నది ప్రవహించుచుండెను. కమల యా ప్రవాహములో లీనమయ్యెను.

౧౧

జమీందారు మోతీలాలుయొక్క స్థితిగతులెట్లున్నవో గమనింతము.

మోతీలాలు నివసించు భవనమునకు శాంతినికేతనమని పేరు. విక్రమనగరములోని భవనములలో శాంతినికేతనము సుప్రసిద్ధమైనవి. జమీందారీ తాణాలలో రామపురం తాణా చాలాప్రసిద్ధికెక్కినది. మోతీలాలు జమీ మొత్తంమీది ఆదాయములో సగమునకు పై ఆదాయము రాంపుర తాణా నుండి రాజధానియగు విక్రమనగరమునకు పంపబడుచుండును. దానిఁబరిపాలించుటకును సంవత్సరమునకు రాదగిన జమీందారీ శిస్తును పన్నులను వసూలుచేసి ఖర్చులుపోను మిగిలిన ద్రవ్యమును ఖజానాకు పంపుటకును తన బావమరది అనగా భార్యాసోదరుడగు రఘునాధున కధికార మిచ్చియుండెను.

రఘునాధుడు మూర్ఖుడు, గర్విష్ఠి, వ్యసనాసక్తుడు. అట్టివానిని బంపుట కిష్టములేకున్నను భార్య బలవంత మధికమగుటచే రఘునాధుని తాణేదారుగ నియమింపక తప్పనిసరి యయ్యెను.

రాజశ్యాలకుడగు రఘూ ఉద్యోగములో బ్రవేశించినది మొదలు గ్రామములో దుర్మార్గములు చెలరేగెను. త్రాగుట, రహస్యముగ గొప్పయింటి యాడుబిడ్డలను కొండంగ్రడను జెరబట్టి వారి యభిమానమును భంగపరచుట ద్యూతము మొదలగునవి

వాని విలాసక్రీడ యయ్యెను. తాణాకు జేరిన ద్రవ్యము మంచితీర్థమువలె విచ్చలవిడిగా వ్యయమగుచుండెను.

మునుపే కోతి. పైగా త్రాగుట, నిప్పుత్రొక్కుట సంభవించినచో దానిం బట్టగలవారెవ్వరు? అట్లే రఘూ వ్యసనాసక్తుడు. అధికారము చేతికివచ్చినది. పైగా రాజశ్యాలకుడు అతని నేరములను జమీందారుతో చెప్పగలవారెవ్వరు? అతని యాజ్ఞ సుగ్రీవాజ్ఞగా సాగిపోవుచుండెను. దుర్మార్గుల గుంపు సర్వదా చుట్టుముట్టి స్తోత్రపాఠములు చేయుచుండ వారి యిచ్చకములకుబ్బి స్వేచ్ఛగ వ్యయమొనర్చుచు నయభయముల వలన కులస్త్రీలను స్వాధీన మొనర్చుకొనుచు లోకకంఠకుడై కాలక్షేపము జేయుచుండెను. విక్రమనగరమునుండి దివాన్ ఖజానాకు ద్రవ్యమును చెల్లింపవలయునని యెన్నియో యాజ్ఞా పత్రములను రఘునాథునకంపెను. కాని యవియన్నియు బుట్టలో జేరుచుండెను. పంపిన తాకీదులకు ప్రత్యుత్తరము లేకపోగా చిల్లిగవ్వయైన రాంపూరు తాణానుండి వసూలు కాలేదు.

దానికితోడు దైవసంకల్పమో లేక చేసికొనిన కర్మ ఫలితమో కాని అతివర్షములవలన చేలన్నియు మురిగి కుళ్ళి పోవుటచే పంటయంతయు నాశనమయ్యెను. రానురాను అతి వృష్టి యధికమై కొలది గ్రామములయందు కలరా మహామారి (ప్లేగు) యంకురించి జనులను కబళింపసాగెను.

గోవిందపుర గ్రామమంతయు కలరా మహామారితో నిండియుండెను. దినమునకు పది పదునైదుగురు చొప్పున మృత్యువున కాహుతి యగుచుండిరి. చచ్చినవారికి సంస్కారము

జరుగు మార్గము కానరాకుండెను. కమలపై యపవాదమును మోపి న్యాయస్థానమున ఫిర్యాదు తెచ్చిన గౌరీశ్వరుని కుమారుడు కలరావలన మరణించెను. గౌరీశ్వరుని దుఃఖమునకు మితి లేదు. నిరపరాధినిని పరాభవించినందులకు ప్రతిఫలముగ గ్రామమంతయు బీనుగుపెంట లగుచున్నది. కమల దుఃఖాగ్ని కాహుతి యగుచున్నదని గ్రామములోని పెద్ద లందరును తలపోయ నారంభించిరి

ఎస్టేటులోని గ్రామములన్నియు నీతిబాధలతో నిండి యుండుటవలన ఖజానాకు చేరవలసిన సాలియానా ఆదాయములో నాలుగవభాగమైన పూర్తికాలేదు. రాంపూరు తాణా నుండి డబ్బు చేరకపోవుట మోతీలాలున కొక దెబ్బ తగిలినట్లుండెను. గవర్నమెంటుకు డబ్బు చెల్లించవలసిన (ఫేష్కష్) తేదీ సమీపించెను. మూడు దినములకన్న వ్యవధి లేదు. ఏమి చేయుటకు తోచలేదు. మోతీలాలునకు గుండెలు కొట్టుకొనుచుండెను. రాంపూరు ఖజానా చేరకపోవుటకు తగిన కారణమేమో తెలిసికొనవలయునని మోతీలాలు కొక భటుని వెంటనిడుకొని రాంపురము ప్రవేశించెను రఘునాధుడు కానరాలేదు. తాణా ఉద్యోగీయులను పిలిపించి విచారింపగా క్రమక్రమముగ రఘునాధుని దుర్మార్గమంతయు వెల్లడియయ్యెను. వానిని పట్టి తెచ్చుటకై భటుల నంపెను కాని యా దుష్టుడు బాబుగారి రాకను దెలిసికొని గ్రామము విడిచి పరారి యయ్యెను. మోతీలాలునకు మతియంతయు బోయినట్లుండెను. రాజస్వము ద్రవ్య మెట్లు చెల్లింపవలయునా యన్న దిగులుపుట్టెను. వెంటనే మరలి విక్రమనగరు జేరి యాలోచించెను. అతని కేమియు

పాలుపోలేదు. ఒక్క యుపాయము తట్టుటచే మరునాడొక భటుని దీసికొని కలకత్తా వెడలిపోయెను. హౌరా స్టేషనులో దిగి బౌబజారు స్ట్రీటులోనికి బండిపై పోయి లక్షాధికారియు గొప్ప కమీషను వర్తకుడగు రామానందచటర్జీ యొక్క కార్యస్థానముం జేరెను. చటర్జీ గొప్పవ్యాపారస్థుడు లక్షలమీద నడ్డీవ్యాపారము జేయుచున్న బ్యాంకరు. అతని కార్యస్థానములో పెక్కుమంది గుమస్తాలు పనిచేయుచుందురు.

ఎల్లప్పుడు వెండి బంగారం రూపాయలు కరెన్సీ తాండవ మాడుచుండును. మోతీలాలతనికడ కొన్నిలక్షల రూప్యములను దాచియుంచెను. ఈ యాపత్కాలములో చటర్జీ దగ్గర దాచిన ద్రవ్యము చాలనియెడల మరికొంత ఋణమును తీసుకొనినైన గవర్నమెంటుడబ్బు చెల్లించుతలంపుతో వచ్చియుండెను.

మోతీలాలు బండిదిగి చటర్జీ కార్యస్థానములో కాలు పెట్టుటయే తడవుగ నాశ్చర్యపడెను. నోట మాటరాలేదు. జనాకీర్ణమై లక్ష్మీనాట్యముతో నిండియుండెడి కార్యస్థానము మూయబడియుండెను. ప్రక్కనున్న కొట్లన్నియు మూయబడి నిర్మానుష్యమైయుండెను

వెంటనే బండెక్కి రామానందచటర్జీ మేడకు వెళ్లెను. అదియును శూన్యముగ నుండెను. నొక భటుడుమాత్రము ద్వారముదగ్గిర నిలువబడియుండ మోతీలాలు వానిని సమీపించి తడబడుచున్న మాటలతో నిట్లు ప్రశ్నించెను.

మోతీ : రామానంద చటర్జీగారు ఎచ్చట నున్నారు ?. వారి కార్యస్థానము వేరొకచోటికి మార్చినారా ?

భటు : మీ కేమి సంబంధము? మీ దేయూరు? కలకత్తానాసులు కారా?

మోతీ . నేను విక్రమనగరు ఎస్టేటు జమీందారును వారికిని మాకును వడ్డీ వ్యాపారములో సంబంధమున్నది.

భటు : మీ కింకను తెలియనేలేదా?

మోతీ · బాబూ! నా కేమియు తెలియదు సత్వరముగ నేమి జరిగినదో వచింపుము.

భటు చటర్జిగారితాలూకు విదేశ వ్యాపారములో (ఎక్ఛేంజీ) నేదో గొప్పనష్టము వచ్చినదట. నష్టమొక కోటి రూపాయలవరకుండునని చెప్పుకొనుచున్నారు. వార్త వినిన వెంటనే కార్యస్థానములు మూయబడినవి. చటర్జీగారు కుటుంబ సహితముగ నెచ్చటకేగిరో తెలియదు. వారి పని దివాలా అయినదని వాడుకపడినది. నిన్న నచ్చట ఇసుకవేసిన రాలని జనము వచ్చి తిరిగి పోయినారు

మోతీలాలు శిరమున వజ్రఘాతమైనట్లుండెను.

మోతీ : అతని దివాలాను కోర్టువారంగీకరించినారా?

భటు : ఆహా! అంతయు నిన్న నైదుగంటలలో పూర్తి యైనది. ఎప్పుడో మిగిలినయాస్తిని వేలామువేసి బాకీదారులకు పంచుదురు.

అని చెప్పి యా భటుడు వెడలిపోయెను. మోతీలాలు నిల్చున్నచోటనే కుప్పకూలిపోయెను. అతని స్వాంతమగు మూలధనము పదిలక్షలితనిదగ్గిర దాచియుండెను. ఆ యాధారం కూడ నాశనమయ్యెను. మధ్యాహ్నము రెండు గంటలకు

సొబ్బును న్యాయస్థానమున చెల్లించనియెడల జమీందారీని వేలాము వేయబడును. ఒక్కమారుగ తన యైశ్వర్యము ఎస్టేటు గౌరవము, పదవి అన్నియు నేలపాలగుటచే కన్నీరుగార్చుచు శోకింప నారంభించెను. సేవకుడు సమీపించి బాబూజీ! విచారించిన లాభమేమి? న్యాయస్థానమునకు బోయి సావకాశమున్నచో వాయిదా తీసికొని వత్తము. తర్వాతసంగతి నాలోచించవచ్చును. అని సలహా నొసంగెను.

మోతీలాలు పెదవివిరిచి లాభములేదు. అయినను నీమాట కాదననేల పోదమురమ్ము. ఇర్వురును బయలుదేరి నాలుగుగంటలకు న్యాయస్థానముంజేరి విచారింపగా ఖజానా జమకట్టవలసిన వాయిదా దాటుటచే జమీందారీ వేలాము పాట పాడబడి ఎవరిపేరనో కొట్టివేయబడెనని తెలిసికొనెను. అన్నియాశలు నశించెను. దుఃఖభారముతో హెడ్ గుమస్తాను సమీపించి విక్రమనగరం జమీందారీ ఎవరిపేర కొట్టివేయబడె నని యడిగెను. గుమస్తా రిజిష్టరుచూచి కాగితముపై వ్రాసి యిచ్చి వేరొకపనిమీదబోయెను.

మోతీలాలు దానిని కంపితహస్తములతో విప్పి చదువు కొన నందిట్లు వ్రాయబడియున్నది.

విక్రమనగరు ఎస్టేటును మహారాజ సతీశచంద్రప్రసాద బహద్దరువారి సహాయమున శ్రీమతి కమలాదేవిగారు కొని యున్నారు.

మోతీలాలు చదువుకొని తలతిరిగి పడిపోవుచుండ సేవకుడు పట్టుకొని వెలుపలికి గొనివచ్చెను.

చూచితిరా! దైవసంకల్పపరిణామము? క్షణములో లక్షాధికారి భిక్షాధికారియయ్యెను.

౧౨

మోతీలాలు బండెక్కి బైలాఘాటులోనున్న తన బంధువుల యింటికిపోయి యానాటిరాత్రి యట గడపెను. అతనికంతయు నంధకారమైపోయెను.

ఆహా! దైవమాయ! ఎంతలో నాకిట్టి దైన్యదశ సంభవించెను. ఆశలన్నియు నిరాశలయ్యెనుగదా? నా దురదృష్ట దేవత నన్ను కాలదన్నుటచేతనే గొప్ప బ్యాంకరుఅని విశ్వవిఖ్యాతిబడసిన రామానందచటర్జి దివాళాయగుటయు సంభవించెను. లేకున్న నేదో యొక విధమున జమీందారీని నిలువ బెట్టుకొనియుందును. ఎంత దుర్దశ! ఇంకెవరునుగాక నాకు విరోధియగు సతీశచంద్రపసాదుడే దీనినికొన రావలయునా? ఇతరు లెవరైన కొనినచో కొంత ప్రయత్నించుటకైనా సావకాశముండెడిది. ఇప్పుడా యవకాశమే లేదు. పెక్కుమారులు న్యాయస్థానమున నతనితో వివాదపడినకారణమున నే నతనితో మాట్లాడదలంచినను నాకట్టి సావకాశ మొసంగడు. మంత్రించి నట్లుగా కన్నులకు గంతలుగట్టి తీసికొనిపోయినట్లాయెనే. ఏ మొగము పెట్టుకొని విక్రమనగరమున కేగుదును? ప్రజ లందరు నన్నెంత చులకనగ జూతురు? అక్కటా నా జీవిత నాటక మీ విధముగ దురవస్థరంగమునకు బూర్తిగానున్నదా?

ఈ కమలాదేవి యెవరు? మహారాజ సతీశచంద్రునకు నామె కేట్టి సంబంధము? నా ఎస్టేటునంతయు గ్రద్ద తన్నుకొనిపోయిన రీతిగ కాజేసినది.

కమలా! కమలా! కమలపేరు తలపెట్టునప్పటి కతనికి సర్వాంగములు కంపించెను. హృదయమున నమితమైనమంట తల తిరుగుట—మర్మభేదః విచారము మొదలగునవి యతనిం జుట్టుకొనెను. పడక కుదరక పొర్ల నారంభించెను దీర్ఘనిశ్వాసములను విడుచుచు అహో! కమలకు నే నెంతపరాభవ మొనర్చితిని ఇదంతయు నా నిరపరాధిని యొసంగిన శాపఫలమే కాబోలు. అమానుషికమగు రాక్షసకృత్యాను—శిరోజఖండనము చేయించి పారదోలితినే. యీ పాపఫల మనుభవింపక తీరునా? కమలా! కమలా! నన్ను క్షమింపుము ఐశ్వర్యమత్తుడనై నీకు దుర్భర పరాభవమును కల్పించితిని. నీ వెచ్చట నున్నావు నన్ను క్షమింపుము.

మోతీలాల్ నిధిముగ శయ్యపై పరుండి తెల్లవార్లు విచారపడుచుండెను. కంటికి నిద్ర యెట్లువచ్చును? ఉదయముననే లేచి స్నానాదులు నెఱవేర్చుకొని బంధువుల యనుజ్ఞగొని రైలు స్టేషనుకు బయలుదేరెను. రెండుదినములనుండి యాహారము తినలేదు. అయినను నతడేమియు గ్రహింపలేదు. అతని యాకలి దప్పులన్నియు నేమయ్యెనో తెలియలేదు. దీర్ఘవిచార మాతని కడుపును నింపుచుండెను.

స్టేషనుకు వచ్చునప్పటికి బండి సిద్ధముగ నుండుటచే టిక్కెట్టు తీసికొని బండిలో గూర్చుండెను శరీరమువూత్రము బండిలో నుండెను. మనస్సుమాత్రము లయించినట్లుండెను.

సకాలమునకు బండి విక్రమనగరము స్టేషనులో నిలువబడెను. బండి సిద్ధముగ నుండుటచే రైలుదిగి వెలుపలకువచ్చి బండి యెక్కి శాంతినికేతనమున ప్రవేశించెను. మహాలులోనికి బోయినవెంటనే నతని కంతయు శూన్యముగ గానవచ్చెను. ఏ వైభవము, ఏ పరివారము—ఏ రాజభవనములు తనవని భావించెనో యవియన్నియు నిక్షేపము పరులపాలయ్యెను. చేత కాసులేని నిర్ధనుడు. ఎవ్వరితో మాట్లాడక యేకాంతగృహమున జేరి కర్తవ్యమును నిర్ధారణమొనర్చెను.

మరునాడు దివాను మొదలగు కర్మచారులనందరిని పిలిపించి జరిగినవృత్తాంతము నెరింగించి వారల కనుజ్ఞ నొసంగి ఇంకమీాద మహారాజ సతీశచంద్రునియాజ్ఞల కెదురుచూడుడు. నాకును నా ఎస్టేటునకునుగల సంబంధము తెగిపోయినదని చెప్పెను ఉద్యోగస్థులందరు మోతీలాలుయొక్క దశకు జాలి పడుచు వెడలిపోయిరి దివాణములో సేవకుల నందరకును పైన చెప్పినట్లే జరిగినవృత్తాంతము నెరుకపరచి పంపివేసెను. నిర్ధను డైన తనకీ పరివారమేల? ఎట్లు పోషించును? తండ్రికి సంభ వించిన దురవస్థకు ఎంతో విలపించి మురుడనము నుండియు నేదియైన యుద్యోగముకొరకు ప్రయత్నము సేయ నారంభించెను. కాని యీ దినములలో ఉద్యోగము దొరకుట యన్న మాటలా! మోతీలాలు మనోహరిని కొరకుచోట వివాహమును స్థిరపరచెను కాని యీ కార్యమును నిర్వర్తింప లేకపోయెను

ఆ నాటికి మనోహరిని భాగ్యసూర్యు డస్తమించి పోయెను.

## ౧౩

మోతీలాలుయొక్క జమీందారీకి సంబంధించిన యావ దాస్తులను స్వాధీనముచేసికొనుటకును పన్నులువగైరా వసూలు చేసికొనుటకును కమలాదేవిగారి పక్షమున గొంతమంది యుద్యోగులు విక్రమనగరమున కరుదెంచి కార్యస్థానములు, భవనమును, రికార్డు ఎస్టేటుకు సంబంధించిన సమస్త వ్యవహారపు కాగితములు మొదలగు వానిని స్వాధీనపరచుకొనుచుండిరి. ఒక యుద్యోగి మోతీలాలును పిలిచి యిట్లనియె :

మోతీలాలుబాబూ! మీ పరిస్థితి మారినది. సంపద యంతయు తొలగినది. తత్కారణమున మీరింత విశాలమైన పెద్ద రాజభవనమును భరింపజాలరు. మా జమీందారిణిగారు నివసించుట కొక రాజమందిరము కావలయును. మీ శాంతి నికేతనమును విక్రయించినచో తదుపరి మీరొక చిన్న యింటిలో నుండవచ్చును. తగినవెల యొసంగబడును. ఆలోచించి రేపటి దినము మా కేసంగతియు నెరింగింపవలయును. మోతీలా లందుల కంగీకరించి వెడలిపోయెను. ఇంటికిబోయి కర్తవ్యమును యోజింపదొడంగెను. ఇంత విశాలమైన రాజభవనము నాకేల ? నా పదవి యేనాడు తొలంగెనో వైభవములన్నియు నప్పుడే విడనాడిపోయెను. దీనిని భరింప నా తరముకాదు. పడిపోయిన మరమ్మత్తుకే విశేషద్రవ్యము కావలయును. దీని నమ్మవలయును. పదునైదువేలకో యిరువదివేలకో విక్రయించి యొక చిన్న యింటిలోనుండి మిగిలినధనముతో పొలముకొని వ్యవసాయము చేయుచు దినచర్య గడపెదను. జమీందారు మరణించి దరిద్ర

మోతీలాలుగా నవతరించుటకు తగినట్లే యుండవలయును. అని నిశ్చయించుకొనెను. కష్టపడి కట్టించిన శాంతిని కేతనమును విక్రయించెదను అను నిశ్చయము కలిగినవెంటనే మోతీలాలు కన్నీటిని విడిచెను.

మరునాటియుదయమున శాంతిని కేతనముయొక్క విలువ స్థిరపడెను. పదునెన్మిదివేల రూపాయలకు కమలాదేవిగారికొరకా భవనము విక్రయింపబడెను. వేరు గృహము నిర్మించుకొను వరకు మోతీలాలు కుటుంబ మందే యుండుట నియమముకూడ నంగీకరింపబడెను. తదనంతరము రెండుమాసములలో మోతీలాలొక చిన్నయింటిని నిర్మించుకొని దానిలో ప్రవేశించెను.

*　　　*　　　*　　　*　　　*

ఆ దినమున రాజభవనమంతయు గందరగోళముగా నుండెను. మహారాజ సతీశచంద్రప్రసాదబహాద్దరుగారు విక్రమ నగరమున ప్రవేశించియుండిరి. గ్రామములోని పెద్దలందరును వచ్చి రాజమందిరములోనున్న మహారాజుగారి దర్శనము జేసికొనిరి. ఒకనాటి మధ్యాహ్నకాలమున మహారాజు విక్రమ నగర వాస్తవ్యుల నందరి నాహ్వానించి రాజభవనమున సగౌరవముగ గూర్చుండబెట్టి యిట్లనియె.

పౌరులారా! నేను మీ ప్రభువును కాను. యీ జమీందారీకి శ్రీమతి కమలాదేవి యజమానురాలు. మీ రందరామె ప్రజలు. నే నామెకు తాత్కాలిక ప్రతినిధిగా మీ యందరికి సందేశము నెరింగింప వచ్చితిని. నేని ఎస్టేటును కమలా

దేవిగారికి పెట్టుబడిపెట్టి కొనియిచ్చితిని. కావున మీ రంద
రామెచే నియమితులగు కర్మచారుల యాజ్ఞల బాలించుచు
మీ ప్రభ్వీపై భక్తితో నుండవలయును. ఇదే నేను మీ కీయ
దలంచిన సందేశము.

మహారాజ సందేశమును విని పౌరులందరును తమకు
రానున్న ప్రభ్వీయగు కమలాదేవిగూర్చి తలపోయుచు సభను
వదలి తమతమ యిండ్ల కేగిరి. అనంతరము రాత్రి తొమ్మిది
గంటలకాలమునకు సతీశచంద్రుడు మోతీలాలును పిలిపించి
యిట్లు మాటలాడెను.

మహా: మీరు చాల కష్టదశలో నున్నారు. అందుకు
నేనును విచారించుచునే యుంటిని. నేను ప్రతిజ్ఞాబద్ధుడను
కానిచో మీ జమీందారి నేదోయొక పద్ధతిపై మీ కిచ్చి
యుందును. ఇందులకై మీరు వ్యసనము జెందవలదు.

కం॥ సిరితావచ్చినవచ్చును । సలలితముగ నారికేళ
సలిలముభంగిన్.

అనురీతిని నైశ్వర్యముయొక్క రాకపోకలను తెలిసికొన
మనతరముకాదు.

మోతీ: ఇది నా దురదృష్టపు దినములు. కావున నే
నిట్టిదశకు వచ్చితిని. మీరుగాక వేరెవ్వరు కొనినను నేను
తిరిగి నా ఎస్టేటును సంపాదించుకొనియుందును.

మహా. నేను ప్రతిజ్ఞాబద్ధుడనై యీ కార్యమున కొడి
గట్టితిని. లేకున్న జమీందారిపై నాకు దృష్టిలేదు. నేనంత
యాశాపరుడనుకాను. నాకున్నది నాకు చాలును.

మోతీ: ఆ ప్రతిజ్ఞను నేను వినవచ్చునా?

మహా : నిస్సంశయముగ పనవచ్చును.

నే నొకమాసు పుట్టింటికి బోయిన నా భార్యను తీసికొని పడవపై ప్రయాణముజేయుచు వచ్చుచుంటిని. ఆనాటి తెల్ల వారుజామున నేనును నా భటులును పడవ పై భాగమున గూర్చుండి మాట్లాడు కొనుచుంటిమి. సుమారు నాలుగు గం టల తెల్లవారుజామున గట్టుపైనుండి యెవ్వరో నీటిలో బడుట జూచి వెంటనే నా భటులకు తెలుపగా వారు యీతవచ్చిన వారగుటచే నల్వురు ప్రవాహములో దుమికి యా శరీరమును పట్టుకొని పడవపైకి చేర్చిరి. విమర్శించిచూడ నా పడిన వ్యక్తి నవయవ్వనములో నున్న సుందరి యని గ్రహించితిమి. ఆమెను తాత్కాలికముగ నుపచారములుచేసి మా యింటికిం గొనిపోయి డాక్టర్లచే చికిత్స చేయించితిని. వారముదినముల కాలమా మె మంచిస్థితికి వచ్చినది ఆమెను నీటిలో బడుటకు గారణము నడిగితిమి. మొదట చెప్పుటకు చాల సంశయించి నది. బలవంతపెట్టి యడుగగా తన కష్టసమాచారమును మా దంపతుల కిర్వురకుమాత్ర మెఱింగించి తనువు చాలించుకొనుట కన్న వేరుమార్గములేక యట్లొనర్చితినని చెప్పినది ఆమె వృత్తాంతమును వినిన పాషాణమైనను కరుగక మానదన్న మా యిర్వురిసంగతి చెప్పవలయునా ? నాభార్య యామెదుఃఖ వృత్తాంతమునకు కన్నీరు గార్చుచు నోదార్చి తనదగ్గర నుంచు కొని కాపాడుచుండెను. నే నామె కష్టములను నివారణజేసి కాపాడి జీవితమును సుఖమయముగ జేతునని ప్రతిజ్ఞజేసితిని. నా కీ వైపున గల జమీందారీ యంతయు నామె కిచ్చితిని. మే మిర్వుర మామెను దత్తపుత్రికగా స్వీకరించితిమి. నాభార్య

తన స్త్రీధనమువలన యీ సికమునగరిం ఎస్టేటును కొని తానామెకు స్వాధీన మొనర్చినది. ఆమె పేరే కమలాదేవి.

మోతీ : కమలాదేవి !

ఒక్కనిముషము ఆమెయే యీమెయా యని తనలో నాలోచించుకొనెను. మరల ప్రశ్నించెను. మహారాజా ! కమలాదేవి యే కులస్థురాలు.

మహా : వైశ్యకులము.

మోతీ : శిరమున కేశములున్నవా ?

మహా : (చిరునవ్వుతో) అదేమి ప్రశ్న. అంత దీర్ఘమైన తిలకట్టును నేను చూచియుండలేను.

మోతీ : ఆమె కెవ్వరైనా బంధువులున్నారా ?

మహా : ఈ భూమండలములో నామె కెట్టిబంధువులును లేరు. ఆమెకొరకే యీ భవనమును కొంటిమి. ఇంక మిమ్ము పిలిపించిన వృత్తాంతమును వినుండు.

మోతీ : సిద్ధముగ నున్నాను.

మహా : మీ రుద్యోగము చేయగలరా ?

మోతీ : ఈ వార్ధక్యములో నెచ్చటికి బోగలను ? నే యుద్యోగము చేయగలను ? నా కట్టి యాసలేదు.

మహా : మీ రెచ్చటికని పోనక్కరలేదు. ఈ ఎస్టేటుకు దివానుగా నుండి వ్యవహారములు చక్కబెట్టుచు కమలాదేవి కూడ యంగీకరింపగలదు.

మోతీ : ఆ కార్యము నా కుమారుడు చేయగలడు. నేనుమాత్ర మెచ్చటను నుద్యోగము చేయజాలను.

మహా : ఇది ఎన్నేటు వ్యవహారము. అతను వ్యవహార జ్ఞానములేని యువకుడు ఉబ్బుబోవని. అందువలన మీరు జామీనుండిన మా కట్టి యాటంకమునులేదు.

మోతీలా లంగీకరించి కుమారుని పిలిపించి యొక ప్రార్థనాపత్రమును వ్రాయించి తన జామీనుపత్రమునుగూడ పూర్తిజేసి రెండును మహారాజున కందించెను. మహారాజు దానిపై కమలాదేవికి ప్రతినిధిగ సంతకముచేసి అనుమతిని లిఖించి మొహరువేసి మనోహరునకిచ్చి రేపటినుండియే మీరు పనిలో ప్రవేశింపవచ్చునని చెప్పెను.

మోతీ : నా కనుజ్ఞయా !

మహా : మీరు వెళ్లవచ్చును. రాగోవు సద్ధతమోగవలె నాడు రాణీ కమలాదేవి బయలుదేరి యిటకు రాగలదు. మహాలంతయు నలంకరించి నగరమంతయు నుత్సవము నేర్పాటు చేసి మంగళవాద్యములతోసహా సమస్త సన్మానములతో నెదురోళ్లు గావింపవలయును మనోహరబాబూ ! మీరీ కార్యమును శ్రద్ధతో నెరవేర్పవలయును.

మనో : చిత్తము.

తండ్రీ కొడుకు లిద్దరు వెడలిపోయిరి. మహారాజు భోజనమునకు పోయెను.

మోతీలాలునకు మనోహరునకు రాణి కమలాదేవి యెవ్వరా ? ఆ కమల యీ కమలయేనా ! కాదాయన్న సందేహముమాత్రము మనస్సును పీడించుచునే యుండెను.

పాఠకులకుమాత్రము సందేహము విడిపోయియుండును కమల భిక్షుకురాలినుండి తప్పించుకొని వెళ్లవారు

జామున నదిలో మునుగు సమయమునకే సతీశచంద్రుని పడవ యాప్రాంతమున బోవుచుండుటయు కమల పసుట పడవ వాండ్రు చూచుటయు జరిగినది. తదుపరి యామె యెట్లు రక్షింప బడినదియు పైన వుదహరింపబడి యున్నది

చూచితిరా! ఎంత విచిత్రసంఘటనము! క్షణములో జమీందారు మోతీలాలు నిరుపేదయయ్యెను. భిక్షుకి యగు కమల రాణియయ్యెను.

## ౧౪

శుద్ధ త్రయోదశినాడు విక్రమనగరమంతయు నలంకరింపబడి యుండెను. వీధులన్నియు శుభ్రముచేయబడి సుభాషితములచే నిండియుండిన పతాకములచే నలంకరింపబడెను. శాంతినికేతనమంతయు సున్నముకొట్టబడి వింతవింత రంగులతో శోభిల్లుచుండెను. అరటి స్తంభములు మామిడి యాకుల తోరణములతో గూడిన విశాలమగు పందిరి వేయబడి యుండెను. పాఠశాలలో బాలురు రాణీ కమలాదేవికీ జయమను అర్థముగల గీతములను పాడుచు చేతిలో జండాలను ధరించి యుండిరి. వారికి మధురపదార్థములు మిఠాయిలు పంచిపెట్టు ఏర్పాటు చేయబడెను.

స్టేషనుకు రైలువచ్చువేళ నాగుటచే దివాను మనోహరుడు దాసదాసీ జనముతో ప్రధానోద్యోగులతో మంగళ వాద్య బ్యాండువాద్య సహితముగ తన నూతనప్రభ్వి

నెదుర్కొనబోయెను. ఇంతేగాక పెక్కుమంది జనము తమ క్రొత్త జమీందారిణిజూడ కుతూహలులై రు రైలుస్టేషనులో నిండి యుండిరి.

సకాలమునకు రైలుబండి వచ్చి ప్లాటుఫారముపై యాగెను. దాసీజనముతో నిలువబడియున్న మనోహరుడు రెండవతరగతి బండివైపునకు బోయెను దివాణపు దాసీజనము కమలాదేవిని క్రిందకు దింపిరి. శిరము మొదల పాదములవరకు ముసుగుతో కప్పబడి యుండుటచే యామె ముఖము మాత్ర మితరుల కెవరికిని కానవచ్చుటలేదు. వాద్యములు మ్రోగు చుండెను. పరివారమంతయు రెండుపంక్తులుతీరి చెరియొక వైపున నడచుచుండ ముందు మనోహరుడు గుఱ్ఱము నెక్కి నడచుచుండగా కమలాదేవియు నామెతో వెంటవచ్చిన సుశీల యను ప్రధానపరిచారికయు సవారీలో వెనుక వచ్చుచుండిరి. సవారి కిరుప్రక్కల తెరలు కప్పబడి యుండెను. వేయేల నగర మంతయు హర్షధ్వనులతో నిండి యుండెను.

మధ్యాహ్నకాలమునకు మహోత్సవమంతయు శాంతి నికేతనము ముందునకువచ్చెను పెక్కుమంది దాసీజనమువచ్చి కమలాదేవిని సవారీలోనుండి దింపి సుశీలాదేవితో గూడ రాజమందిరాంతర్భాగమునకు గొనిపోయిరి. శాంతినికేతనము పై సుందరములగు జెండాలు ఎగురు చుండెను.

దాసీలు రాణిగారిని మెత్తనిశయ్యపై గూర్చుండబెట్టి విసినికర్రలతో విసరుచుండిరి. ఒక యరగంట కాలమునకు కమలాదేవి వారి నందరిని యావలకు బంపి సుశీల తనతో

వచ్చిన మరి యిద్దరు దాసీలనుమాత్రము సమీపమున నుంచుకొనెను.

కమల తన కాకస్మికముగ సంభవించిన దశాపరివర్తనము దలంచి పెక్కురీతుల తలపోయనారంభించెను. విధినిర్మాణము తెలియుట సంభవముకదా! ఒకానొక దినమున నే నిచ్చటను మర్భరపరాభవాగ్నికి బొల్పడి ఖండిత కేశపాశనై వెడలగొట్టబడి యేడ్చుచు బోవుచుండ నన్నుజూచి జాలిపడి యాదరించిన వా రొకరును లేరు. ప్రశ్నించినవారు లేరు. నేడు నా ధర్శనమునకై నా యనుగ్రహమునకై పెక్కుమంది నిరీక్షించుచున్నారు. నా యాగమనమున కెంతమహోత్సవము జరుపబడినది? ఆహా! ఎంతచిత్రము. ఇదంతయు లక్ష్మీదేవి ప్రభావము. ప్రపంచకమున నిజమైనదరిద్రున కెచ్చటను స్థానములేదు. వాని యాకలి దప్పులనుగురించి ఆరోగ్యమునుగూర్చి ప్రశ్నించువారు లేరు. తుదకు మానవుని మానవుడే హతమార్చుచుండెను. ఆ మహామాతి నా యభిమానజనని నాకేల యీ యైశ్వర్యమును గల్పింప వలయును? భిక్షుకురాలనగు నన్ను రాణినిగా నేల యొనర్ప వలయును? ఏమిలాభము ఎవరికొరకుగా నేని భారమును దాల్చుట కంగీకరించితినో యీ మనోహర దివ్యాశేషసుఖము లభించినప్పుడుగదా! నాకీపదవి యానందకరము. అని తలపోయుచు నిద్రించెను.

౧౫

పది పండ్రెండుదినములు జరిగెను. అంతవరకు దివాణములో నుత్సవములు జరుగుచుండెను.

ఒకనాటి సాయంకాలము పూఁదోటభాగమున కమల సుశీలతో ప్రశాంతిగ కూర్చుండియుండెను. మందమలయ సమీరణ స్పర్శనలె వారిరువురిహృదయములయందొకవిధమైన యనిర్వాచ్యమగు సంతోషము కలిగెను. అకస్మికముగ నామె హృదయమునకొక సంకల్పముకలిగి లేచిచూచెను. కమలకు పూర్వవృత్తాంతమంతయు జ్ఞప్తికి వచ్చుటచే దన జన్మభూమి యగు గోవిందపుర గ్రామమువైపునకు చూడ్కులను బరపెను. సుమారు క్రోసెడు దూరములోనున్న యా గ్రామపు సరిహద్దులలోనున్న తాటివృక్షములు తమాలవృక్షములు కాన్పించెను. ప్రాణములన్నియు దనపై నిల్పి దుఃఖించుచు ప్రాణములను విడిచిన తల్లియొక్క స్వరూప మామెకు జ్ఞప్తికి వచ్చెను. తత్కారణమున జల్లాడిపోయిన యామె మనఃఖాన్ని మరల వ్రుల్గానెను. అవిరామముగ కన్నీరు ప్రవహించుచుండుటచే దూరముగనున్న సుశీల సమీపించి భుజముపై చేయివైచి కన్నీరు తుడుచుచు నిట్లడిగెను.

సుశీ : దేవీ ! ఇంతను దుఃఖపడుచుంటివే ! నీ మనోవ్యాకుల మింకను మరపునకు రాలేదా !

కమ : నా మనోవ్యాకులము జన్మమధ్యమున మరపునకు రాదు.

సుశీ : చిరకాలమునుండి తమ జీవితరహస్యమును విన వలయునని కోరిక గలదు. వినదగినదైనచో తెలుప ప్రార్థించు చున్నాను.

కమ : సుశీలా ! నీకన్న యాంతరంగికురా లెవ్వరు ? నాయభిమానజనని నన్ను నీయధీనముజేసి యిచ్చుటకె బంపెను. అట్టి నీదగ్గిర దాచదగిన విషయమే లేదు.

సుశీ : అట్లయిన నిపుడే ప్రారంభింప వలయును.

కమ : ( సుశీలను దగ్గిరగా తీసికొని ) సుశీలా ! నీవు నా దాసివికావు ప్రాణస్నేహితురాలవు. నాజీవితరహస్యమును నా యభిమాన జననీజనకులగు మహారాజదంపతులకు గాక నితరులకును తెలియదు. ఇప్పుడు నీకు దెలియజేయుచుంటిని. ఆప్తురాలవగు నీతో వచించినచో నా భారము కొంత తగ్గునని నా యాశయము. రేపుసాయంకాల మీ వేళకే మన మిచ్చట కలసికొందము. అప్పుడు నా వృత్తాంతమంతయు నాలకింతువు గాక.

* * * *

సుశీల గౌరవకుటుంబమున జనించిన వైశ్యయువతి. అత్తవారింటికేగిన రెండు మూడు సంవత్సరములకే వితంతు వాయెను. పతి మరణించిన యనంతర మత్తవారింట నామెకు స్థానము దొరకకపోవుటచే వేరాధారములేని యాయగతిక మహారాజ సతీశచంద్రప్రసాదుని యంతఃపురమున దాసియై ప్రవేశించి తన మంచితనముచే సత్శీలమువలన మహారాణి కాంతరంగికురా లయ్యెను. కమల వచ్చినప్పటినుండియు నిర్వురకును స్నేహ మధికమయ్యెను. కమల తానువచ్చునప్పుడు

సుశీలను వదలజాలక మహారాణి యనుమతిబొంది శాశ్వతముగ దనతో నుంచుకొనుటకై వెంట గొనివచ్చెను.

మరునాటి సాయంకాల మారుగంటలకు కమల సుశీల యిద్దరును మేడ పైభాగమునజేరిరి. ఒకదాసి వచ్చి పడక కుర్చీలచటనుంచి పోయెను. వానిలో కూర్చుండి చల్లగాలి విసరుచుండుటచే హృదయమునకు శాంతి జనింప కమల యిట్లు వచింప నారంభించెను.

కమ: సుశీలా! ఇచ్చటికి సుమారు రెండుమైళ్ల దూరముగానున్న యీ చెట్లగుంపును చూచితివా?

సుశీ: చూచితిని.

కమ: అదియొక గ్రామము. దానిపేరు గోవిందపురము. అదియే నా జన్మస్థానము. యీ శరీర మచ్చటనే పెరిగినది. నే ననుభవించిన స్వల్ప సుఖమునకును కష్టపరంపరలకు నా గ్రామమేగాక గ్రామవాస్తవ్యులుకూడ కారణభూతులు. అచ్చటనే నన్నుకన్నతల్లి నాదురవస్థను, తన యనంతరము నాకు రాబోవు కష్టములను దలంచుకొని మహావస్థపడి ప్రాణము వదలినది.

సుశీ: ఇప్పుడచట మీ బంధువు లెవరైన నుండిరా?

కమ: నాకీ లోకములో బంధువులనువారు లేరు నా జన్మస్థలమగు గృహముకూడ నా గ్రామమున నుండియుండదు.

సుశీ: తమ వివాహమైనదా? అత్తవారిల్లెచ్చట?

కమ: నా వివాహమైనది. కాని లౌకికవివాహముకాదు. సూర్యచంద్రులు సమస్తదేవతలు సాక్షిగా జరిగిన గాంధర్వ

వివాహము. ఈ సౌధమే నా యత్తవారిల్లు. నెలదినముల క్రిందవరకు జమీందారుగా పేర్కొనబడిన మోతీలాలు నా మామగారు. వారి కొమారుడును ప్రస్తుత మీ ఎస్టేటు దివానుగా మహారాజుగా పేర్వరచిన వ్యక్తియే నా భర్త.

సుశీ: ఎవరు? దివాన్ మనోహరబాబుగారా!

కమ: అవును. ఆయనయే నా భర్త నా జీవితమునకు దైవము.

సుశీల కత్యంతాశ్చర్యము ఆనందము కలిగెను. పట్ట జాలని కుతూహలముతో చేతులు తట్టుచు ఇక నేమి? దొంగ దొడ్డిలోనే బంధింపబడెనుగదా! విచారమేలా నేటిరాత్రియే రాణిగారికి భర్తగారితో మధురసమావేశమును కలిగించెదను. మీ భర్త మీ చేతిక్రింది యుద్యోగి. స్వగృహములోని సంగతి ఇంకా ఆలోచనమేల?

కమ: ఎందులకా గందరగోళము. ఆ కార్యము నీవు చెప్పినంత సులభమేయైనచో నీ వరకే పూర్తిచేసి యుందును. దాని కాటంకము చాల గలదు. తదుపరి విషయమును గూడ నాలకింపుము.

కమల గోవిందపుర గ్రామములో తన భర్తకును దన కును జరిగిన వృత్తాంతమును తదనంతరము జరిగిన విషయము నెరింగించి యిట్లనియె.

సుశీలా! వింటివా? నా దౌర్భాగ్యవశమున కన్న బిడ్డయూ దక్కలేదు. పతియూ విసర్జించెను. మనకుగా యభి మానమును వదలుకొని వారి సన్నిధిని బయముపడినను సహజ భీరువులై లోకోపవాదమునకు భయపడిన నా భర్త వివాహము

కాకమునుపే యొక బిడ్డనుగనిన నన్ను తిరిగి యంగీకరించునా ? ఆలోచించి చూడుము.

సుశీ : దేవీ ! ఎంత వెర్రిదానవు ? అతడు సమస్త దేవతలు సాక్షిగా నిన్ను చేపట్టలేదా ! నీ యొక్క సంతానోత్పత్తికి తాను కారకుడు కాదా ! ఇంక లౌకికవివాహము జరుగలే దందువు. అందులకు దగిన యత్నమును చేయుదము. నే నొక్కవిషయమును తెల్పుచుంటిని. నా మాటలు వింటివా నీకు మేలగును.

కమ : అదేమి ?

సుశీ : నేను కమలనై మనోహరబాబుతో మాట్లాడి యావద్వృత్తాంతము నతని నోటినుండియే పల్కించెదను. నా తమాషా చూడుము.

కమ : జాగ్రత్తసుమా రహస్య మితరులకు తెలియరాదు.

సుశీ : నీకాభయ మక్కరలేదు. లోనికి రమ్ము.

ఇర్వురును లోనికేగిరి. క్షణకాలములో నొకరి దుస్తులొకరు మార్చుకొనిరి. కమలను వేరొకగదిలోనికి బంపి తా నొకగదిలో నొక మెత్తనిసోఫా వేయించుకొని కమల వేషముతో నలంకరించుకొని కూర్చుండెను. అంతరంగికురాలగు చపలయను దాసిని పిలిచి తగురీతిని బోధించి దివాంజీగారిని పిలువుమని చెప్పెను. చపల గదియంతయు నలంకరించి దూరముగ నొక కుర్చీనుంచి బల్లపై అత్తరు పన్నీరు మొదలగు సుగంధద్రవ్యములను ఫలములను అగరువత్తుల నుంచి వెలిగించి దివాన్ మనోహరబాబును పిలువ బోయెను.

సుమారు పావుగంటకాలమునకు మనోహరుడువచ్చి గదిలో కాలిడుటకు సంశయించి, విసరుచున్న చపలతో రాణి నా హేంబావా రెచ్చుట ? అని యడిగెను.

చపల దూరముగనున్న కుర్చీలో మనోహరుని గూర్చుండ నియమించి సుశీలవైపునకు కనుసైగ జేసెను.

మనో : (కూర్చుండి) అమ్మా ! నమస్కారము.

సుశీ : (లేచి ముందునకు జరిగి) మీరు నమస్కరింప నక్కరలేదు. ఆశీర్వదించిన జాలును వయస్సున పెద్దలుకదా !

మనోహరుడేమియు మాటాడక కూర్చుండెను. సుశీల పుస్తకమును జదువుచున్నట్లు నటించుచుండెను. మనోహరుడు మధ్యమధ్య తెప్పవాల్చక కమలవేషమును ధరించిన సుశీలను చూచుచుండెను.

ఈ జమీందారీకి యజమానురాలగు కమలను మహారాజ సతీశచంద్రుడు నదిలో గొట్టుకొనిపోవుచుండ తీసి కాపాడి తన యభిమానపుత్రికగా భావించి యీ జమీందారీని కొని యిచ్చినట్లు మనోహరుడు తండ్రిదనలన విని యామె తప్పక తన ప్రియురాలై యుండుననియు సమయముజూచుకొని తన యభిప్రాయ మామె కెఱిగింపవలయునని నిశ్చయించెను. ఇప్పుడు రాణిదైన కమలయొక్క రూపము వేరుగా నుండుటచే మనోహరుడు నిరాశజెంది యొక భిక్షకురాలికి రాజ్యాధికార మెట్లు లభించును ? ఇదంతయు భ్రమయని యెంచి తన యనుమానమును పూర్తిగ రహితము చేసికొనెను.

ప్రక్కనున్న చపల మందస్మితాననయై దేవీ! దివాన్ బహదూరువారు కూర్చున్నారు. మాట్లాడరేమి?

సుశీ : ఎవరితో మాట్లాడవలయును? మహారాజుగారికి బుద్ధి భ్రమించుటచే నిట్టి వ్యవహారజ్ఞానములేని యువకుని దివానుగా నియమించిరి. ఈయన తానువచ్చిన పనిని తెలిసికొనక మాటిమాటికి నన్ను జూచుకొనుటకు కారణము తెలియకున్నది.

సుశీల పైటచెంగు ముఖమున కడ్డముగా నుంచుకొని లోలోన నవ్వుకొనుచుండెను

మనోహరుడు సిగ్గుపడెను. తానొనర్చిన పనికి మిగుల నొచ్చుకొనెను యజమానురాలికి క్రోధము వచ్చెనని మిక్కిలి భయపడెను. వెంటనే లేచి చేతులు జోడించుకొని వినయముతో నిట్లనియె, దేవీ! క్షమింపుడు. తాము మాకు తల్లి సమానులు. పర స్త్రీలను దురభిప్రాయముతో జూచు దుర్మార్గుడనుకాను.

సుశీ : మీరెంత పర స్త్రీ పరాఙ్ముఖులో మే మెఱుంగుదుము. గోవిందపుర గ్రామములో నొక పేద గ్రామీణకన్యను మోసగించి యామె యభిమానమునపహరించిన మహానుభావుల సంగతి మాకు తెలియదనుకొంటిరా?

మనోహరుడు లజ్జితుడయ్యెను. మెల్లగ నిట్లనియె.

మనో : గోవిందపురవాసినియగు కమల పర స్త్రీకాదు. నా భార్య.

సుశీ : మీ రామెను వివాహమాడితిరా?

మనో : లౌకికవివాహము కాకున్న నేమి ? సూర్య చంద్రులు సాక్షిగ నే నామెను గాంధర్వవిధిని బరిణయమాడి యుంటిని.

సుశీ : అట్లయినచో నామె నేల పరిత్యజించిరి ?

మనో : లోకాపవాదములకు తండ్రి కోపమునకు భయ పడి పరదేశముల కేగితిని.

సుశీ : లోకాపవాదములకు జంకి చేబట్టిన భార్యను వదలువా రుందురా ?

మనో : శ్రీరామచంద్రు డంతవాడు వదలెను.

సుశీ : మీ పురాణములను వదలిపెట్టి, కారణమును వివరముగా వచింపవలెను.

మనో : మా యిర్వురకును జరిగిన వివాహమును లోకు లంగీకరింపరు. తండ్రిగా రామె నింటికిం గొనిరానీయరు. నే నామె నెచ్చట నిలుపవలను ? అందువలన పరదేశములలో నొక యాధారమును జూచుకొని యామెనుఁ గొనిపోనెంచి వెడలిపోయితిని.

సుశీ : మీరు లేనప్పు డామె యెట్టివిపత్తులకు జిక్కెనో యామెగతి యే మయ్యెనో విమర్శించితిరా! వెదకించితిరా ?

మనో : తల్లి చనిపోయిన యనంతర మామె యెట కేగినదో జాడ తెలియలేదు.

సుశీ : ఆమెకు మీ తండ్రిగారు కలిగించిన పరాభ మెట్టిదో మీకు దెలియునా ? దాని కెవరు కారకులు ? అందులకు లేశమాత్రమైన మీకు చింత కలిగెనా ?

మనోహరు నేత్రము లశ్రుపూరితము లయ్యెను.

మనో : (కన్నులు తుడుచుకొని) అందులకై నేను పడిన సంతాపమెట్టిదో నా హృదయమున కెరుక.

సుశీ : పోనిండు. ఆ యభాగిని యాత్మహత్యకు వెరచియు నాకటిచిచ్చునకు తాళలేకయు దన సతీత్వమును గోల్పోయి యుండిన—

మనో : తమరు పొరబడుచున్నారు. ఆమెయొక్క పరిశుద్ధస్వభావమును నే నెరెంగుదును. ఆత్మహత్య యొనర్చు కొనునుగాని కమల తన శీలమును పాడుచేసికొనదు. ఇది నా దృఢవిశ్వాసము. నే నామెను వెదకించితిని కాని యామె జాడ తెలియలేదు

మేమిప్పుడు వెదకించుటకు ప్రయత్న మొనర్చెదము. మీ రామె నంగీకరింతురా ?

మనో : నా కెట్టి యభ్యంతరమును లేదు.

సుశీ : సమాజముగాని—మీ తండ్రిగారు గాని—యంగీక రించని యెడల—

మనో : నే నట్టి యాటంకముల నికమీద లెక్క సేయు వాడను కాను. నేను నా భార్యతో ప్రత్యేకముగా నుండ గలను.

సుశీ : ఈశ్వరసాక్షిగ వచించుచున్నారా ! మగవారి మాటలు నీటిమూటలు.

మనో : దైవసాక్షిగ జెప్పుచుంటిని. కమలను పరి గ్రహించుటకు నా కెట్టి యాటంకమును లేవు.

సుశీ : ఆమెను వెదకించు ప్రయత్నము చేసెదము. తదుపరి మేము కొన్ని ధర్మకార్యములకై సంకల్పించితిమి. ఆ కార్యభారమును మీరు మీదబెట్టుకొని నిర్వహింపవలయును.

మనో : తమయాజ్ఞ శిరోధార్యము.

చపల లోపలికిబోయివచ్చి భోజనమునకు రమ్మని యాహ్వానించెను. సుశీల లేచి వెడలుచు మనోహరునిజూచి మీరిక్కడనే కూర్చుండుడు. నేను భుజించి వచ్చెదను. అని చెప్పి లోనికేగెను. మనోహరుడు రాణి యాగ్రహమునకు గురికాకుండ తప్పించుకొనగలిగితినని శాంతించెను.

కమల సుశీలకై వేచియుండెను. సుశీల కమలను సమీపించి చిరునవ్వునవ్వుచు దేవీ! సర్వము సిద్ధమైనది. పోయి అనుభవించుటయే తరువాయి. అని పల్కెను.

కమ : ఏమి సిద్ధపరచితివి ?

సుశీ : అవధరింపుడు

సుశీల మనోహరుడు చెప్పిన ప్రతివిషయమును కమల కెఱుకపరచెను.

కమ : (చిరునవ్వుతో) నేను ప్రక్కగదిలోనుండి మీ నాటకమంతయు గమనించుచునే యుంటిని.

సుశీ : మా మాటలు నీవేల వింటివి ? నీ సుఖములో నేనేమైన భాగము పంచుకొందునను భయమా !

కమ : ఛీ ! దుష్టురాలా ! చావుము.

సుశీ : చచ్చుటకు నాకర్మమేమికాలినది. నేను కమలను మనోహరుడు నా యధీనుడు. ఇర్వురము కొంతకాలము సంసారము చేసిన తరువాత——

కమ : దుర్మార్గురాలా ! ఇంకను నీ సంభాషణము మానవా ?

సుశీ : సరే. లేచి నిల్చుంటద్దముకడకురమ్ము. రాణిగారి నలంకరింపవలయును.

కమ : నా కక్కర లేదు.

సుశీల కమల చెవులో రహస్యముగ గొన్నివిషయము లను దెలిపెను.

సుశీ : అంగీకారమేనా ?

కమ : ఇంతకాలము పడిన కష్టము దేనికి ?

సుశీ : అలంకరింపు మనెదవా ?

కమ : అక్కర లేదు.

సుశీ : ఉన్నదానియెనే నీవు లోకులకు వైరాగ్యముం దెచ్చుచుంటివి. వేరే అలంకార మెందులకులే ?

కమ : అదేమి ?

సుశీ : జగన్మోహనమైన నీ రూపములేదా ఇంకేమి కావలయును ?

సుశీల బలవంతముగ కమలకు తలదువ్వి జడవైచి విలువగల చీరగట్టి విరులుముడిచి మనోహరుడున్న గదివరకు బంపి వెనుకకువచ్చెను. కమల ద్వారముకడ నిలువబడి సందిగ్ధహృదయముతో లోనికి బోజాలక స్వామితో నెట్లు ప్రసంగింతునా యని యనుమానించుచు తుదకు పతిని జూడవలయునన్న యాతురత పట్టజాలక తటాలున లోనికేగి మంచముపై కూర్చుండెను. చపల లేచి నిలువబడెను. కమల దాసింజూచి తమలపాకులు తెచ్చి బల్లపైనుంచి విసరుమని చెప్పెను. దాస వెంటనే వెండిపళ్లెరములో తమలపాకులు వక్కపొడి మొదలగు

సుగంధద్రవ్యములు ఫలములు నుంచుకొనివచ్చి బల్లపై నుంచి కమలకు విసరుచుండెను.

మనోహరుడు వంచినతల యెత్తలేదు. యజమానురాలి కంఠధ్వనిలో భేదమును కనిపెట్టి తలయెత్తి చూడదలంచియు నిదివరలో నొకమారు చూచుటవలన కలిగిన ప్రమాదమును తెలిసికొనియుండెను. కావున తలను వంచియేయుండెను.

కమల సుశీల బోధించినవిధముగ మాట్లాడవలయునని నిశ్చయించి కంఠమెత్తబోవ యెలుంగురాలేదు. రెండు నిముసములు కంఠము సరిజేసికొని ధైర్యము తెచ్చుకొని ప్రారంభించెను.

కమ : నేను చేయబూనిన దానధర్మవ్రతాచరణమునకు తమ సాయ మావశ్యకము.

మనో : (వంచినతల యెత్తకయే) తమ ఆజ్ఞాప్రకార మొనర్చుటకు సిద్ధముగ నుంటిని.

మనోహరునకీమారు కంఠస్వరభేదము బాగుగ తెలియ వచ్చెను. సుశీల లోపలనుండి కలకలనవ్వుచు దేవీ! మీరంత ప్రార్థింపనక్కరలేదు. ఆయన మీ సేవకుడే. మీ యాజ్ఞ నొనర్చుటకు సిద్ధముగనేయున్నాడు. అని పలికెను. మనోహరుడీకంఠస్వరమును గుర్తించెను. ఇంతకుముందు మాట్లాడిపోయిన యజమానురాలి గొంతువలెనున్నదే. మరి యీమె యెవరు? రాణీ కమలాదేవి ఈమెయా? ఆమెయా?

మనస్సు పరిపరివిధముల బోవుచుండుటచే నేదియు నిశ్చయించుకొనజాలక మనోహరుడు సందిగ్ధావస్థకుం జిక్కి యుండెను. భర్తయొక్క కలవరమును తలపోసను కమల

గ్రహించి శీఘ్రముగ దనను దెలుపుకొనకున్న వేరుమార్గము లేదు. అని నిశ్చయించుకొని సుశీల నుద్దేశించి యిట్లనెను.

ఎంతమాట ! వారు నా సేవకులుకారు. నేనే వారి సేవకురాలనగు కమలను.

మనోహరుడీమారు తన మనస్సును నిలుపుకొనజాలక తలయెత్తి కమలను జూచెను తన నేత్రములనే నమ్మజాలక పోయెను. నిదానించిచూచి తన ప్రియురాలగు కమలయేయని నిశ్చయించుకొనెను. వింటసంధించి విడిచినశరమువలె తటాలున బోయి హా కమలా ! యనుచు నాలింగన మొనర్చుకొనెను. కమలయు ప్రత్యాలింగన మొనర్చుకొనెను. కొంతకాలము కన్నీరు కార్చుటయేగాని యెవరును మాట్లాడజాలకపోయిరి. ఒక పావుగంటకాలమునకు మనోహరుడు కమల నొడిలోనికి దీసికొని కమలా ! నీ యవస్థలకును నీ పరాభవమునకును నీ యకాల మరణోద్యమమునకు గారకుడగు నీ కఠినుని క్షమింపుము. నేను నిలుకడ జూచుకొని నిన్ను గొనిపోదలంచితినేగాని నిన్ను విడిచిపోవ తలంపు నా కెన్నడును లేదు. ఇంతలో విధి మనకు వ్యతిరేకుడయ్యెను.

కమ : ప్రాణాధికా ! మీా రేమియు నిందించుకొనవలదు. అదంతయు నా దుర్దిన మాహాత్మ్యముకాని వేరుకాదు.

మనో : హృదయేశ్వరీ ! నీకు కష్టములేనిచో నీ విషాద వృత్తాంతమును వినగోరుచున్నాను.

కమల తనతల్లి పోయినదిమొదలు నేటివరకు జరిగిన యావద్వృత్తాంతము నెఱింగించెను. ప్రియురాలికి సంభవించిన కష్టములను విని మనోహరుడు కన్నీరు గార్చుచు రోదన

మొనర్చెను. కమల నాధుని వక్షముపై శిరముంచి కన్నీరు తుడుచుచుండగా సుశీలవచ్చి చిరునవ్వు నవ్వుచు రాజకీయోద్యోగుల కింత సాహసమా! అని అదలించెను.

మనోహరుడు మందస్మితవదనుడై ఇదంతయు మీ కొసంగిన సాహసమేయని బదులుపల్కెను.

సుశీల భోజనపదార్థములదెచ్చి నిర్వురముందుంచెను. చిరవియోగ మనుభవించిన యా దంపతు లానందముతో భుజించిరి.

సుశీల పాత్రలనుగొని వెడలిపోవుచు కమలామనోహరు లున్న గదితలుపును వెలుపల గొళ్లెమువైచెను.

ఆ యానందరాత్రిలో కమలకు జమీందారీ లభించిన విధమును మనోహరుడు తెలిసికొని దైవానుగ్రమున కెంతయు సంతసించెను. నాటిరాత్రి వారి కెంత యానందము?

## ౧౬

దుర్భర వియోగాగ్నిలోబడి దహింపబడుచున్నా ప్రేమీ ప్రేమకు లిర్వురును నాటిరాత్రి యెట్టి స్వర్గీయానందము ననుభవించిరో వారికే తెలియవలెను.

తెల్లవారగనే సుశీల తలుపు తెరచెను. అంతకుముందే మెలుకువగానున్న కమల సిగ్గుతో బైటకేగెను. కొంతసేపటికి ముప్వురు కాలకృత్యములు తీర్చుకొని సమావేశమై ఓ ప్రణాళికను తయారుచేసిరి. యా విధముగ కార్యక్రమముచేయుటకు నిర్ణయించిరి. మనోహరుడు యింటికి వెడలుచు సుశీల చాతుర్యమును పొగడి వెళ్లెను.

మోతీలాలు ఒకనాడు మాటల సందర్భమున కుమారు నితో రాణీ కమలాదేవి ఎవరు ? ఆమె నెన్నడయినచూచితివా ? అని అడిగెను. మనోహరుడామాటకు యీమాటావిషయము తప్పకుండా తెలిసికొందునని చెప్పెను.

సుమారు నెలదినములతర్వాత సతీశచంద్రునివద్దనుండి మోతీకొక జాబు వచ్చెను. అందిట్లుండెను :—

మహాశయా ! 'నా యభిమానపుత్రికయగు కమలాదేవి అవివాహితయు సాంప్రదాయకుటుంబమునకు చెందినట్లు నాకు తెలిసినదిగాన అట్టి సత్శీలవతిని మీ కోడలుగా పరిగ్రహించుట కంగీకరింతురని కోరుచున్నాను.

ఇట్లు
మహారాజ సతీశచంద్రప్రసాద్

మోతీలాలు చదువుకొని మొదట సంశయించెనుగాని కమలయొక్క యైశ్వర్యమును జమీందారీని తలంచుకొని ముగ్ధుడయ్యెను. జాబును కుమారునిచేతికందించి యభిప్రాయము నడిగెను.

అందులకతడు మీ యభిప్రాయమే నా నిశ్చయమని చెప్పెను.

మోతీలాలు వెంటనే తన యంగీకృతిని జాబువ్రాసి మహారాజునకు తెలియపరచెను. గోవిందపురగ్రామవాస్తవ్యులు విక్రమనగర వాస్తవ్యులు వెనుకటి యనాదినియగు కమలను మరచిపోయిరి. ఆమె యాత్మహత్య జేసికొనెనని తలంచిరి. క్రొత్తరాణియగు కమల నెవ్వరును జూచియుండలేదు. మరియు

రాజ్యములో నామె తలపెట్టిన ధర్మకార్య ప్రణాళికనుగురించి మిక్కిలి ప్రశంసింపసాగిరి. ఇంతలో మనోహరబాబునకును రాణి కమలాదేవికిని వివాహము జరుగనున్న సంగతి యూరంతయు వ్యాపించెను. జనులంద రాశ్చర్యమగ్నులై మనోహరుని యదృష్టదశను వేనోళ్ళ బొగడుచుండిరి.

ఒక శుభలగ్నమున మహావైభవముగ కమలా మనోహరులకు వివాహము జరిగెను. కమలాదేవి రాణియగుటచే పాదాది శిరఃపర్యంతము మేలిముసుంగుతో కప్పబడి పెండ్లిపీటపై కూర్చుండుటవలన పెండ్లికుమార్తె స్వరూపము నెవ్వరును జూడలేకపోయిరి. చివరకు మనోహరుని తల్లికిగూడ తెలియదు. మహారాజదంపతులు స్వయముగ సపరివారులై వచ్చి పాణిగ్రహణమును జయప్రదముగ జరిగించిరి. దానధర్మములు జాతిమతవివక్షతలు లేకుండా సమస్తమైనవారికి నొసంగబడెను. ఒక అనాధశరణాలయము, భిక్షుక ధర్మసత్రము, ధర్మవైద్యశాల ధర్మవిద్యామందిరము, కమలాదేవి పేరున స్థాపింపబడెను. ఆబాలగోపాల మామె ధర్మబుద్ధిని కొనియాడదొడంగిరి.

వివాహానంతరము అందరు స్వస్థానముఁ జేరిరి. కమల తన యభిమాన జననీజనకులకు నమస్కరించి కన్నీరుగార్చెను. మహారాణి కమల నొడిలోనికి దీసికొని బిడ్డా! నేటికి నీకష్టములు గట్టెక్కినవి. ఈ ప్రభుత్వమును నైశ్వర్యమును నీకు లభించి నందులకుగా నీవు దీనులను ఆపన్నులను గాపాడవలయును. లోకములో ధనికులకేగాని దరిద్రుల కెట్టి యాధారములేదు.

వారి మొరలను వినువారు లేరు. కావున నీవు దీనసంఘముపై కన్నుంచి కాపాడినయెడల దీనబాంధవుడగు పరాత్పరుని యనుగ్రహము నీయందు స్థిరముగ నుండును. నేను యీ రాజ్యమును నీకొసంగినకారణ మిదియే అని ప్రబోధించి యా దంపతులు వెడలిపోయిరి.

ఒకమారు మనోహరునితల్లి కోడలినిజూడనెంచి దాసి వలన వార్త నంపెను. సుశీల యామెంగొనిపోయి కమలనెదుట నిల్పెను. కమల అత్తగారిపాదముబడి క్షమింపుడని వేడుకొనెను. అత్తగారు తెల్లబోయి కొంతసేపటికి గుర్తించి నీవు కమలవా! యని కౌగిలించుకొని యామె యభివృద్ధి కెంతయు నానందించెను. మొదటినుండియు కమల నామె ప్రేమించుచున్న సంగతిని పారకు లెరింగినదే. ఒకానొకదినమున సమయము జూచుకొని మోతీలాలున కామె రహస్యము నెరింగించెను. మోతీలాలు కమలసాహసమునకు కంటగించుకొనినను కోడలు రాజ్యాధీశ్వరి యగుట నేమియు ననక యూరకుండెను.

కమలకొక కుమార్తె కలిగెను. తూగుటూయలలో కూర్చుండి బిడ్డ నొడిలో నుంచుకొని ముద్దులాడుచుండ మనోహరుడు వచ్చి భార్యసరస గూర్చుండెను. కట్టెదుట నలంకరింప బల్లపై నొక చిత్తరువు ప్రేములో బిగింపబడి గుడ్డ కప్పబడి యుండెను. మనోహరుడావస్త్రమును తప్పించిచూడ తన ప్రియురాలి చిత్రపటము. బికారిణి వేషముతో దిరుగుచున్న నాటివేషము చిత్రింపబడియుండెను. క్రింద మూడక్షరముల పేరు "భిక్షుకి" అని వ్రాయబడియుండెను.

మనోహరుడు భార్య నాలింగనము చేసికొని ప్రియా! నీ వే వేషముతో నున్నను నా కానందమునే కూర్చెదవుకాని యా నామధేయముమాత్రము నామనస్సును బాధించుచున్నది. అని పెన్సిలుతో ఆ పేరును కొట్టివేసెను.

కమల తన కష్టములో గని పెట్టిన గోవిందపుర గ్రామ వాసినియగు వృద్ధవితంతువును బిలిపించి తన యంతఃపురములో నుంచుకొని జీవితకాలమంతయు బోషించెను.

[illegible] మనోహరుడు భార్యాసహితుడయి తండ్రికి నమస్కరించి [illegible]కార్యములను జూడవలయుననియును రాజమహాలులో నివసింపవలయునని ప్రార్థించెను. కమలయు [illegible]గారి ననేకవిధముల ప్రార్థించెను. కాని మోతీలాలు కొడ[illegible]:

కుమారీ! నేను నీపట్ల మహాపరాధమునొనర్చిన దోషిని. కనులుగానక చేసినపనికి భగవానునిచే శిక్షింపబడితిని. పోగొట్టుకొనిన నా ఎస్టేటును దైవము నీకొసంగెను. నాకీరాజ్యములో నెట్టి హక్కునులేదు. ఎట్టి యధికారము నికమీద పొందదలచుకొనలేదు. నాకీ కుటీరమే చాలును. నా జీవితకాలమంతయు నా స్వార్జితధనముతో నీ కుటీరములోనే గడపుచు వెళ్లించెదను. మీ దంపతులిర్వురును సుఖింపుడని చెప్పి వారిని సాగనంపెను.

కమల ధర్మబుద్ధినివీడక నిరుపేదలకు అనాథులకు తల్లియై రాజ్యమును పాలించుచుండెను. ప్రజలందరామె ధర్మములకు మెచ్చుకొనుచు సుఖించుచుండిరి.

స మా ప్త ము.

రాజేశ్వరి ప్రెస్, రాజమండ్రి.